# పండితాశయములు

రాజమహేంద్రవరము దొరతనము వారి కాలేజిలోఁ
ప్రధానపండితులగు బహ్మశ్రీ మ. రా. రా. శ్రీ,
కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు:—

"రత్నావళి. శ్రీనివాసకల్యాణకర్త యీకృతిఁ
జేసినకవి వినుతుఁడు గా!
మానవతీచరిత మీయది విషయము మఱి
మాన్యం బని యన వలె నే?
మాననీయపదవాక్యరసోచిత
మహితరచన మిది రూపక మౌఁ,
గానఁ గాన నగు సుకృతుల కే యని
కాంతు రనిమిషత ఘనరసికుల్.

రత్నావళి. మానవతిఁ జెలుపఁ దలపడువార్ కో
మటిజంగంబుల వలెఁ జెడుదుర్;
మానవతీపాకరసాసక్తులు
మనెదరు భీమన సోమన నా;
మానవతీశుఁడు గోపాలుఁ డన
స్నహితుఁడు రసికుఁడు ముద మొందున్;
మానవతికృతి యు మాధవకృపచే
మహి మహితమగు చనముఁ గాంచున్,

రత్నావళి. శ్రీవిక్రమదేవవర్మరచిత
శ్రీమానవతీనాటకమున్
ధీవిలసిల్లఁ గొ - వేంకటరత్నము
ధృతిఁ గని రత్నావళు లొసఁగెన్ ;
శ్రీపరభక్తిని నాయకమణి గను
జెలఁగుటఁ గృతికర్తకుఁ గృతికిన్
భావిత మైన నసారం బని నూ
ల్పగిది నిది యు భౌన్యము గా దే?"

~~~~~~~~~~

కింకవీంద్రఘటాపంచాననవిద్వత్కవిబాలకళానిధి
బాలసరస్వతీశతావధాని బ్రహ్మశ్రీ తిరుపతి
వేంకటేశ్వరకవీశ్వరులు:—

"క. మీని ర్మిత మగునూతన
మానవతీచరిత మొక్కమాఱు చదువ మా
వీనుల కమృతపిపాస న
వీనకృతుల నైత ముద్భవించెఁ గవీంద్రా!

ఉ. మాన వతీతకర్మములు
మంచిపతివ్రత శేనిఁ, జిత్త భూ
మానవతీవ్రవేదనల
గ్రుందుదురాత్మఁ డౌ గ్రుందుఁ గావునన్
~~~~~~~~~~

మానవతీమతల్లి తన
    మానముఁ దా విడ రా ద టంచు మీ
మానవతీచరిత్ర నయ
    మార్గముఁ దెల్పుచు నుండె స్త్రీలకున్.

చ. పదములసొంపుఁ గన్న మృదు
    భావము విన్న రసజ్ఞమాధురీ
సదనము లైనపద్యముల
    సారసి యారసి చూచినన్ రసా
స్వదము గ గద్యలో సులభ
    శైలిని వ్రాసినవాక్యము ల్పఠిం
పఁ దనివి తీరు నే? కవికి
    మానవతీచరితంబులోపలన్.

గీ. కల్పనాకౌశలంబు నంకములపొందు
    బడి యు నద్యతనాంధ్రరూపకము లాఁడి
చూపువారికిఁ దగి యుండెఁ జుమి భనద్వి
    రచితమానవతీచరిత్రమున సుకవి!

గీ. వరుస నిట్లు మనోహరఫణితు లొలుక
    నాటకంబులు మంచివి తేట తెలుఁగు
నం దొనర్చుచు వర్ధిల్లు మయ్య! రచిత
    దివ్యకవికర్మ! విక్రమదేవవర్మ!"



గంజాముజిల్లా రస్సెల్కొండలో డి॥ కలక్టరు గా నున్న బ్రహ్మశ్రీ మ - రా - రా - శ్రీ, జయంతి రామయ్యపంతులు బి. ఏ, బి. ఎల్. గారు:—

"......విద్వత్కవు లగుతమచే రచింపఁ బడినగ్రంథము సలక్షణ మని వేఱె చెప్ప నక్కఱలేదు కదా! 'మ్రదిమ' 'కజము' 'రాత్రీనుఁడు' మొద లగుప్రౌఢప్రయోగము లచ్చ టచ్చట నున్నను మొత్తముమీఁద శైలి మిక్కిలిసుగమము గా నున్నది.......... నాటకములో ముఖ్యవర్ణనాంశము పాతివ్రత్యమహిమ. అది బాగు గావర్ణింపఁ బడినది. మానవతి దృఢపతివ్రత యే కాక, తనప్రాణ మును గాపాడుకొను శక్తి కూడఁ గలిగి యున్నది. ఈ రెండు కలిసినం గదా మహిమ హెచ్చగును?........."

# ద్వితీయసంస్కరణపీఠిక.

ఈ నాటకము 1908-వ సం॥ ప్రథమ శాస్త్రపరీక్షకుఁ బఠనీయము గా నిర్ణయింపంబడుటవలనను జనసమాదరణముం గాంచుటవలన నిపుడు ద్వితీయసంస్కరణము వెలువడుట తటస్థించెను. ఇందు ప్రథమసంస్కరణమందలి ప్రమాదజనితదోషంబులు సంస్కరింపంబడుట యే కాక, శ్రోతృజనశ్రోత్రరంజనము కొఱకుఁ బాత్రోచితము గా నెనిమిదిపాటలు పొత్తంపుందుదిం జేర్పంబడెను. పాటలను నాటకమున నెక్కడ నుపయోగింపలయునో తెలియుటకుఁ బువ్వులతో నాంగ్లేయాంకములు వేయంబడి యున్నవి.

ఇది యు ను మొదటిసంస్కరణమువలె జనసమాదరణముం గాంచుం గాత !

విశాఖపట్టణము,
10—6—11.

విబుధవిధేయుఁడు,
శ్రీ వి క్ర మ దే వ వర్మ.

## ప్రథమసంస్కరణపీఠిక.



ఏతచ్చరిత్ర మాంధ్రులకు నూతన మైనది కాదు. కాన దాని నిట విస్తరించి వ్రాయు టనావశ్యకము.

ఈ నాటకరచనలో నే నొందినపరిశ్రమమును బాల కోత్తములు గ్రహించి, నా తప్పులను మన్నింతురు గాక! ఇప్పాత్తము 1904-వ సం॥ జూను తే 25 దీకి ముగిసెను.

విశాఖపట్టణము,
1—8—05.

విబుధవిధేయుఁడు,
శ్రీ విక్రమదేవవర్మ.



## ఈనాటకమునందలి పాత్రములు.

---

### పురుషులు

మాధవవర్మ—కళింగదేశాధిపతి.

గోపాలవర్మ—మాధవవర్మపుత్త్రుండు, కథానాయకుండు.

కేశవవర్మ—కర్ణాటకదేశాధిపతి.

మానవర్మ—మానవతిపురుషాకృతి.

గుణనిధి—మాధవవర్మమంత్రి.

శ్రుతధృతి—కేశవవర్మమంత్రి.

రామభద్రుండు—కళింగాధిపతిప్రతీహారుండు.

శూరసేనుండు—కర్ణాటకాధిపతిప్రతీహారుండు.

వీరసేనుండు— ,, భటుండు.

వినోదుండు—విదూషకుండు.

నరసింహశాస్త్రి, పద్మనాభశర్మ —కళింగదేశస్థబ్రాహ్మణులు.

మహాదేవయ్య—రామేశ్వరస్థబ్రాహ్మణుండు.

శంకరగుప్తుండు—కనకపురియందలి వర్తకుండు.

ముద్దుసామి—శంకరగుప్తుని సేవకుండు.

గౌరీపతి—కనకపురియందలి యొకజంగము.

భీమన్న } —దొంగలు.
సోమన్న }

సూత్రధారుఁడు —నాటకాధ్యక్షుఁడు.

కొందఱుసభ్యులు ను గొందఱు భటులు ను.

## స్త్రీలు

గుణవతీదేవి—కేశవవర్మ పత్ని.

మానవతి—కేశవవర్మ పుత్త్రిక, కథానాయిక.

ఇందుమతి } —మానవతీసఖులు.
చారుమతి }

నటి—సూత్రధారుని ప్రియురాలు.

శ్రీ

# మానవతీచరిత్రము.



## ప్రస్తావన.

---

### నాంది.

—o—



శ్రీరాధాననకంజమోదితమనో
భృంగుండు గోపాలుఁ డా
భీరీమానవతీపటాళిహరుఁ డా
భీలాఘనాశుండు శ్రీ
గౌరీనాథవిధాతృముఖ్యసురసం
ఘస్తవ్యుఁ డబ్జాశుగా
కారుండాద్యుఁడుగుప్తవిశ్వుఁడుమిము
న్గాచుంగృపన్నిచ్చలున్.

ఉ. గాత్రజితాతసీసుముఁడు
కాంచననేత్రుఁడు పూతచిత్రచా
రిత్రుఁడు నారదాదిముని
బృందహృదంబుజమందిరుండు లో
కత్రయపాలకుండు శ్రిత
కల్పనగుండు విశాఖపూర్జగ
న్మిత్రసమాజసభ్యులను
మిక్కిలిమక్కువతోడఁ బ్రోచుతన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(తెరవంకఁ జూచి) వెలఁదీ! వీలయినచో నీ వొక సారి యిటు రమ్ము.

నటి—[ప్రవేశించి] 1 * ఇదిగో వచ్చితిని. నే నిప్పు డేయాదేశంబును బాలింప వలెనో యానతిచ్చెదరు గాక!

సూత్ర—సుందరీ! చూడవా? మనము ప్రయోగించునాటకమును జూడ నీసభాస్తారులు వేడుక గలవారలు.

నటి—ఏకవివిరచిత మగు నేచరితమును బ్రయోగింపన్ మీరు నిశ్చయించితిరి?

సూత్ర—"మానవతీచరితము" ను; తత్కవి:—

ఆ. వె. శ్రీపతిపదపద్మసేవారతుఁడు భర
ద్వాజమానిగోత్రవర్ధనుండు
కృష్ణచంద్రదేవనృపవరపుత్త్రిండు
విక్రమేశవర్మ విబుధహితుఁడు.

నటి—అది మిక్కిలిచక్కనినాటకము. దాని నిప్పు డిచ్చటఁ బ్రయో
గింప నొప్పును. కాని, ముందు నేఁ జేయున దేమి?

సూత్ర—సరసమానసతోషణం బగునీవసంతసమయమును వర్ణించి,
వీరి కర్ణరంజనముఁ జేయుటకంటె వేఱే మున్నది?

నటి—చిత్తము. (అని పాడును.)

2 *రత్నావళి.

అళులులతాంతమధురమధుపానము
హాయిగఁ జేసి మదించె; లతా
వళి నగవరయుత యై తనరారెను
స్వాధీనపతిక పగిది నహా!
యిలాజాతములు కిసలయములతో
సింపుగఁ గనుఁగొన నయ్యెను; గో
కిలములు శ్రుతిహితముగఁ బాడఁ దొడం
గెను జూతకిసలములఁ దినుచున్.

సూత్ర—(చింత నభినయించును.)

నటి—అర్యపుత్త్రా! మీరు వగఁగొని యున్నట్లు మీమొగము చెప్పక చెప్పు చున్నది. కారణ మేమి? నాగానము సరసముగా లేదా?

సూత్ర—ఈసభ్యులను జిత్తరువులకరణిం జేయఁ గలిగిన నీగానము లెస్సగా లేకుండు టెట్లు?

నటి—అ ట్లయిన నీక వే కారణమున?

సూత్ర—

చ. మన మిపు డీసభాసదుల
మానవతీచరితప్రయోగసా
ధనమునఁ దన్పఁజాలుదు మె
తద్దయునంచుఁ దలంకుదు న్మదిం
దనయుని కింకఁ బెండిలి యొ
నర్చి ముదాంబుధి నోలలాడఁ జా
ల నయితి నంచుఁ గుందెడుని
లాపతి మాధవుమాడ్కి భామినీ!

నటి—ఆర్యపుత్త్రా! మీరు నటాగ్రగణ్యులరు; వీర లన్ననో గుణగ్రహణపారీణులు. కావునఁ జింతింపం బని లేదు.

సూత్ర—అట్లయిన ననంతరకృత్యముల కై మనము వెళ్లుదము. రమ్ము.

(అని నిష్క్రమింతురు.)

---

ఇది ప్రస్తావన.

---

# ప్ర థ మా ం క ము.

ప్రదేశము—కళింగరాజభవనము.

[మాధవవర్మమహారాజును గుణనిధిమంత్రియుఁ
గూర్చుండి ప్రవేశింతురు.]

మాధ—మంత్రీ, గుణనిధీ!

ఆ. వె. సుతునిపరిణయంబు సొంపు గాఁ గావించి
కనుల కఱవు దీఱఁ గాంచి ముదముఁ
జెంద నైతి ననెడుచింతాలతిక నాదు
మనమునందు నల్లు కొనియె నకట!

అది యు నుం గాక,

గీ. పరిణయోత్సవ మైనతర్వాత నాదు
తనయు యువరాజు గాఁ జేసి ధరణిభరము
గొంత యతనిపై మోపి విశ్రాంతి నొందఁ
దలఁచి యున్నాఁడ నామదిఁ దథ్య మిద్ది.

గుణ—ఏలిక యాలోచించినది మిక్కిలి చక్కగానున్నది. యువ రాజుగారు విద్యాయౌవనజ్ఞానసంపన్నులు. ఇఁక నాలస్య మేల? ఆజ్ఞ నొసంగినచోఁ దత్ప్రయత్నము శీఘ్రము గా నొనర్చెదను.

మాధ—(కొంచె మాలోచించి) మంత్రీ! ప్రతీహారిని బంపించి, చిరంజీవి నిక్కడ కిప్పుడు రప్పింపుము.

గుణ—రామభద్రా! రామభద్రా!

రామ—[ప్రవేశించి] ఏమి యానతి ?

గుణ—నీ వేగి యువరాజు, గోపాలవర్మగారి, నిటకుం బిలుచుకొని రమ్ము.

రామ—చిత్తము. [అని వెళ్లి, గోపాలవర్మతోఁ బ్రవేశించును.]

గోపా—[ప్రవేశించి] నాయనగారూ! నమస్కారము. (అని మ్రొక్కును.)

మాధ—సుఖీభవ. నాయనా! ఇక్కడఁ గూర్చుండుము.

(అని తనప్రక్క నున్న పీఠముపైఁ గూర్చుండం జేయును.)

గోపా—నన్నుం బిలిపించిన హేతువు నానతిత్తురు గాక!

మాధ—ఆలకింపుము :—

క. నందనులకుఁ దలిదండ్రు లె
ఱొంగుగఁ బరిణయమును సలుపుట విధి యయినన్
నందనులసమ్మతిం దగఁ
బొంది యొనర్చిన వివాహము సుఖాస్పద మా.

కనుక నీయనుమతిం గైకొని నీకుం బెండిలిఁ గావించి మన్నయనో త్సవంబు నొందం గోరువాఁడను.

గోపా—నాయనగారూ! వివాహ మాడ నాకు నిచ్చ లేదు. కావన మీరు తత్ప్రయత్నమును మానుదురు గాక!

మాధ—నాయనా! విద్యాబుద్ధులు గలనీ కీయుద్దేశ మేల కలిగెను?

గోపా—బాగుగా నాలోచింపఁ గాఁ బెడ్లియంతటివంత గలిగించు నది వే ఱొండు లేదు. ఏల యన:—

ఆ. వె. ఏషణాళిజనన హేతుభూతంబు సం
సారజలధిపతన కారణంబు
విత్తహానికరము విగళితస్వైరము
ప్రచురదుఃఖదంబు పరిణయంబు.

మాధ—(నవ్వి) రాచపట్టివగు నీ కిట్టిబుద్ధి పుట్టె నెట్లు? నాయనా! లెస్స గా వినుము:—

చ. అతులసుఖప్రదంబు, పురు
షార్థచతుష్టయసాధకంబు, సం
తతిలతికాలవాలము, బు
ధస్తవనీయము, భోగమోదసం
యుతము, పితౄణమోచనక
రోన్నతసాధన మావివాహమున్

యతిపతులట్లు నీవు విడ
నాడఁ దలంచుట యుక్తమా? సుతా!

తనయా! సన్యాసులధర్మము మన కేల?

గుణ—యువరాజా! మహారాజుగారియుక్తులు యుక్తి యుక్తములు; మఱి పాలనీయములు.

క. పరధర్మ మధిక మయినం
బురుషుం డాత్మీయధర్మము విడిచి దానిన్
బరఁగఁగ నవలంబించుట
దురితజనక మనుచుఁ జెప్పుదురు బుధు లనఘా!

గోపా—మంత్రివర్యా! మీపలుకులు న్యాయసంగతము లైన వే. కాని, పరిణయముంజేసికొని, పడ రానిపాట్లు పడఁ జాలను. ధర్మవిరుద్ధమయిన ను గానిండు.

గుణ—పరిణయమువలనఁ గష్టము లేల కలుగును?

గోపా—సతీసహవాస మాత్రమున.

గుణ—యువరాజా! చెలులచెలిమి మీవంటిమతిమంతుల కెట్లు ముప్పుఁజేయఁగలదు?

గోపా—నే నన నెంతవాఁడను? ఎనితలచేత నెందఱు మహనీయులు వంచింపఁ బడలేదు?

రత్నావళి

తలిరుఁబోఁడి మేనకచేఁ గుశికా
త్మజుఁడు వంచితుఁడు గా లేదా?
కలికి కైకబోధనచేఁ గొమరులఁ
గానకు దశరథుఁ డంపెఁ గదా!
యలశూర్పణఖావచనమువలన ద
శాస్యుఁడు స్వకులముతోఁ జచ్చెన్!
గులుకులాఁడి చిత్రాంగిపలుకు విని
కొడుకును భూపుఁడు దండించెన్!

మాధ—నాయనా! అట్లెంచఁ జనదు. బాగుగా నారసి చూడుము.

సీ. హరిహరబ్రహ్మల కంబ యై చెలఁగిన
యనసూయ యిట్టిది యనఁ దరంబె?
ముగురుశక్తుల మించుసుగుణంబులు గలలో
పాముద్రమహిమంబుఁ బలుక నగునె?
మరణ మొందిననాథుఁ జిరజీవిఁ జేసిన
సావిత్రి వినుతింప శక్య మౌనె?
సురల మాని నలభూవరు నె వరించిన
దమయంతిచరితంబుఁ దలఁప వశమె

మఱి యరుంధతి మొద లైనమానవతుల
యమలచారిత్రములఁ గొనియాడఁ గలమె?
నిందితల మాత్ర మెన్నుట నియతి యగునె?
పురుషు లందఱు సుకృతులా? వరకుమార!

గోపా—లోకమున సుగుణవతు లే లేరని నే ననను. కాని నూటికిఁ దొంబదితొమ్మిదిమంది దుర్గుణవతులే యని నమ్ముదును. నాయన గారూ! వనితలవర్తనం బజునికైన నభేద్యంబు!

గీ. భీకరహరిదంతంబులఁ బెఱుకఁ గలము,
త్రాఁచును మెడహారంబు గాఁ దాల్పఁ గలము,
సమదకరితోడ సమరంబు సలుపఁ గలము,
చేడెజాడలు మాత్రము చూడ లేము.

గుణ—నృపనందనా! మానసమున లేనిపోనియనుమానముల నుంచు కొని, యీశ్వరోద్దేశ మగువివాహమును మానఁదగదు.

క. గురుసంసృతిశకటము స్త్రీ
పురుషు లనెడుచక్రయుగ్మముఁ గలిగి చను; నం
దరి యొక్కటి లేకుండినఁ
జరియింపఁ గఁ గలదె యద్ది? సజ్జన వినుతా!

కావున మీరు సర్వవిధంబుల వివాహంబునకు సమ్మతింప వలెను.

గోపా—అమాత్యశేఖరా!

క. శుకభృగుపతిజడభరతస
నకగాంగేయాదులు పరిణయము నధికదుః
ఖకర మని మాన లేదా?
యొకఁడను నే మానఁ గా నె యుర్వికి లోటా?

నేఁ బెండిలి మానినమాత్రాన విస్మృతం బగునీవిశ్వంబున కెట్టి లోపంబు ను గలుగదు. కనుక నిష్కారణము గా వనితలవలలలో నన్నుం జిక్కుం జేయఁ జూడఁజనదు.

మాధ—నాయనా! నీపేర్కొనిన మొదటినలుగురును ఋషు లేకదా. నే నాదిం జెప్ప లేదా "సన్యాసులధర్మము మన కేల" యని? ఇఁక నైదవవాఁ డన్ననో పితృభక్తిచేత బ్రహ్మచర్యము నవలంబించెను. కావున మతిమంతుండ వగునీవు నామాటం బాటించి గృహస్థుండ వగుము.

గోపా—నాయనగారూ! భవత్పాదారవిందంబులందు నాకుమాత్రము భక్తిలేదా? నే నింత గా విన్నవించుచుండుట దురంతచింత నను భవింప లేక యె. జాలి మాలి నన్ను దుఃఖాబ్ధిని ద్రోయఁ బూనుట మీకు న్యాయమా?

మాధ—(జనాంతికముగా) మంత్రీ! పడఁతుల నడతలందుం గడు సంశయించి, చిరంజీవి వివాహము నొల్లక యున్నవాఁడు సుమ్ము.

గుణ—(జనాంతికముగా) ఔను. దేవరయే యాసందేహంబును దీర్పవలెను.

మాధ—(ప్రకాశము గా) నాయనా! నీ యనుమానము నిఁక మానుము. ఉద్వాహంబున కొప్పు కొనుము. చక్కఁగాఁ బరిశీలించి మంచికుల శీలములు గలరాజ కన్యను దెత్తుము. పుణ్యాచరితులదుహిత సుచరిత యై యుండుం గదా?

క. ఘనకులమున నుత్తమతతి
జనియింపక యధమసమితి జన్మించునె? కాం
చనఖనియందు నిజం బగు
కనకము గాకుండ నినుము గలుగునె? తనయా!

గోపా—మీ రట్లు సెల వీయం జనదు. బాగు గా నాలోచింపుఁడు.

గీ. పూతకులమునఁ గుజనాళి పుట్ట వచ్చుఁ
గలశవారాశి గరళంబు గలిగినట్లు:
దుష్టకులమున సుజనాళి దోఁప వచ్చు
బురదయందుఁ దామరసంబు వొడమునట్లు.

కాఁబట్టి తలిదండ్రులను బట్టి పట్టి యిట్టి దనం జాలము. నాయన గారూ! పెక్కు పలుకు లేల? నేను మీయాజ్ఞకు బద్ధుండను. కాని—

మాధ—నాయనా! సంశయింపకుము. నీమనోభీష్టము నెఱవేర్పుము

గోపా—నేను స్వయము గాఁ గన్యాగుణములం బరీక్షించినం గాని. పరిణయంబుం జేసికొనను.

గుణ—(నృపునితో జనాంతికము గా) దాని కేలినవారు సమ్మతింప వచ్చును.

మాధ—నాయనా! నీవు వివాహంబుఁ జేసికొనినం జాలును. కడమ దే దెట్లయినను గా వచ్చును. కన్యాన్వేషణముకొఱకు తగుబలంబుతో బయలు వెడలుము.

గోపా—నాయనగారూ! నాకు సైన్య మక్కఱ లేదు. హయవాహన మాత్రుండనై పయనముం జేసెదను.

మాధ—నీయిచ్ఛ వచ్చునట్లు చేయ వచ్చును. నీవు వివేకివి గదా.

గుణ—మంచిదినమున నిర్గమించుట యుక్తము. మహారాజా! ఇది తడెయగుటవలన సభ నలంకరింప విచ్చేయుఁడు.

మాధ—అ ట్లగుం గాక!

(అని యందఱు నిష్క్రమింతురు.)

ప్రదేశము-రాజమందిరప్రాంగణము.

[ప్రయాణోచితవేషంబుతో గోపాలవర్మ ప్రవేశించును.]

గోపా—(తనలో) సుగుణవతి యగునొక రాజకన్యను నెమకి వివాహంబుఁ జేసికొనుటకు నాకు నాయనగారు సెల విచ్చిరి గదా. దానికై పుణ్యభూమి యగు నార్యావర్తంబున కిప్పు డేగెదను. అచ్చోట లభింపనిచోఁ బిమ్మట దక్షిణాపథంబునకు వెళ్ల వచ్చును. ఈప్సితఫలప్రదుండును మంగళాకరుండు నగువానుదేవుందలంచి పయన మగుట శ్రేయస్కరము.

కవిరాజవిరాజితము.

అజగిరిశాదిసురాళికిరీటరు
చాధికరాజితపాదనఖా!
వ్రజవనితాననపంకజభాస్కర!
పాండునృపాలకసూనుసఖా!
కజదళలోచన! కాంచనచేల! జ
గత్పరిపాల! మునీశనుతా!
గజపతిరక్షక! కామితసర్వసు
ఖప్రద! మాధవ నందసుతా!

సర్వయమకకందము.

అరిదరకర! భూధర భూ
వర! మిత్రానందసౌఖ్యవర్ధన! యఘహా!
యరిదరకర! భూధరభూ
వరమిత్రా! నందసౌఖ్యవర్ధన! యఘహా!

షోడశదళపద్మబంధము.

ప్రమాణికావృత్తము.

పరాత్పరా! దరావరా!
మురాసురారి! రామ్బరా!

చరాచరాకరా! నరా!

సురాపరా! స్మరాదరా!

3 * (అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—మార్గమధ్యము.

[ఒకదిక్కునుండి నరసింహశాస్త్రియు వేఱొకదిక్కు నుండిపద్మనాభశర్మయు బ్రవేశింతురు.]

పద్మ—ఓహో! నరసింహశాస్త్రీగారూ? నమోనమః.

నర—వేదోక్తం పరిపూర్ణ మాయుష్య మస్తు. ఏమోయి, పద్మనాభ శర్మా! నీవా? ఎక్కడనుండి వచ్చు చున్నవాఁడవు? నీ వెవరికిం జెప్పక యెక్కడ కేగితివి? మీవారు నిన్ను వెతకి వెతకి వేసారిరి!

పద్మ—చిన్నతనమున నేను గాశికి వెళ్లి చదువుకొనుట మీ రెఱుంగరా? అప్పు డటువైపున నున్నదివ్యదేశములను దర్శించితిని. ఇంటికి వచ్చిన పిమ్మట దక్షిణాపథమున కేగ నెన్నిసారులు ప్రయత్నించిన ను మజ్జననీజనకులు నన్నుఁ బోనిచ్చినవారుకారు. కావున నెవరికిం దెలియకుండ బయలుదేఱి రామేశ్వరాదిదివ్యస్థలములను సేవించి, యిప్పుడింటి కేగు చున్నవాఁడను.

నర—మంచిపనిఁ జేసితివి.

ఆ. వె. బావిలోనికప్పవడువునఁ బూరుషుం
డింట నెల్లకాల ముంట కంటె
వివిధదేశములకు వెళ్లి వింతలఁ జూచి
విజ్ఞుఁడగుట మేలు పృథ్వియందు

పద్మ—శాస్త్రిగారూ! మీ రెటు వెళ్లు చున్నవారు?

నర—మాధవవర్మ మహారాజుగారి యాజ్ఞగొని, శ్రీరంగమునఁ గా నున్న పండితసభకు.

పద్మ—మనవారందఱు ను క్షేమము గా నున్నవారా? వింతలు గలవా?

నర—అందఱు ను సుఖము గా నున్నవారలు. తగిన కన్యకొఱకు యువరాజు, గోపాలవర్మ గారు, ఉత్తరదేశంబుల కేగి యున్నవా

పద్మ—యువరాజుగారే వెళ్లి యున్నవారా?

నర—ఔను. ఆయనమాత్ర మె. "స్వయము గాఁ గన్ముల గుణంబులం బరీక్షించినం గాని పరిణయముం జేసికొన" నని యొ శపథము.

పద్మ—శపథము సేయుట సుకరము; అంతఃపురంబులలో కన్నెలగుణంబులం బరీక్షించుట మాత్రము దుష్కరము.

నర—అజ్ఞునకు దుష్కరము; కాని విజ్ఞునకుఁ గాదు.

క. అణుతుల్యవస్తుజాలం
బణుదర్శనివలనఁ గంటి కగపడు పగిదిన్

గుణములు నిష్పాక్షికసుని
పుణబుద్ధిబలంబువలన స్ఫుటము గఁ దెలియున్.

పద్మ—పో నిండు. మనయువరాజుగారితోఁ దమసుతలు సంభా షించుటకు రాజులు సమ్మతించెదరా?

నర—“సమ్మతించెదరా?” యనెద వేమి? “సమ్మతించిరి; మఱి సమ్మతించు చున్నవా” రనుము.

పద్మ—ఎంతవింత!! సమ్మతింపఁ గారణ మేమి?

నర—కారణమా? యువరాజుగారివిద్యాసద్వంశవయోరూపసమృద్ధత్వ మె. అతనింగనినకన్యాజనకు లాతం డెట్టు లేని దమ కల్లుం డయినం జాలు నని మున్ముందు గా నతనికిం దమకిన యలఁ జూప నీయకొను చున్నవారలు.

యువరాజుగా రేయేకన్యలం గనిరో యాయాస్థలములం దేమి జరిగెనో మీ రెఱుంగుదురా?

—కొన్నింటిని మాత్రము విని యున్నవాఁడను.

వానిని సెల విండు. విన నాకు వేడుక పొడము చున్నది.

అట్లయిన న్వినుము. ఆయన కాశి కేగ నక్కడియొకిమోఁ చాతని కత్యాదరముతోఁ దనసుతం జూప నాతఁ డా మెం గని ప్రసంగవశంబున:—

గీ. “చేడె! నీకుమానంబుఁ గాఁపాడువారు
జగతి నెవరు వచింపు సంశయము విడిచి”

యని యడుగ నమ్ముద్దరాలు:—

"అరయ నామానమును గాచునట్టివారు
నాదుతలిదండ్రులే సుమ్ము నవఘృపాంక!"

యన నాతఁ డావీడు విడిచి చనెను.

పద్మ—తరువాత?

నర—అతఁడు మిథిలానాథుకూఁతుం జూచి మునుపడిమాడ్కి నడుగ నబ్బాల:—

"అరయ నామానమును గాచునట్టివాఁడు
నాదుప్రాణేశుఁ డే సుమ్ము నళిననయన!"

యన నతం డచ్చటినుండి యరిగెను.

పద్మ—పిమ్మట?

నర—ఆతండు వంగదేశంబునకుం బోయి యచటినృపనందనిం గని తొల్లింటిచందంబున నడుగ నగ్గోల:—

"అరయ నామానమును గాచునట్టివాఁడు
మేటిమగఁటిమి గలనాదు మేనమామ"

యని పలుక నతం డక్కడనుండి వెడలెను.

పద్మ—అటుతరువాత?

నర—ఆతఁడు పాంచాలభూపపుత్త్రిని వీక్షించి పూర్వమునలె నడుగ నమ్ముగ్ధ:—

"అరయ నామానమును గాచునట్టివాఁడు
నాదుసోదరుఁ డే సుమ్ము మేదినీశ!"

యని నుడువ నతఁ డద్దేశమును విడిచి వెళ్లెను.

పద్మ—అటు పిమ్మట?

నర—అతండు కాశ్మీరరాజసుతను గోడఁ గని పూర్వరీతిం బ్రశ్న సేయ నబ్బేల:—

"అరయ నామానమును గాచునట్టివారు
నాదుచెలికత్తియ లె సుమ్ము నతవిపక్ష!"

యని వచింప నతం డావోటుం బాసెను.

పద్మ—తర్వాత?

నర—అతఁడు కన్యాకుబ్జరాజన్యకన్యం గాంచి యథోక్తముగ నడుగ నయ్యబల:—

"అరయ నామానము గాచునట్టివారు
పటుసమర్థు లౌరక్షకభటు లె సుమ్ము."

అనఁగా నాతం డారాజ్యమును గడచి పయన మాయెను.

పద్మ—తదనంతరము?

నర—అనంతర మతం డేదేశమున కేగెనో యేమి జరిగెనో నాకుం దెలియదు.

పద్మ—శాస్త్రిగారూ! యువరాజుగారిమనోరథంబు సఫలంబు గాదు నుఁడీ.

నర—అట్లనకుము. దైవానుకూల మున్నచో నది దుర్లభ మయినది కాదు. శర్మా! ఇప్పుడు చాలసేపాయెను. కనుక రమ్ము నేఁడు మన మొక్కచోట నె దేవతార్చనముం జేసికొని పిమ్మట నిజమార్గానుసారుల మై వెళ్లుదము.

పద్మ—అట్లే కానిండు.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



# ద్వితీయాంకము.



ప్రదేశము—పురోపకంఠము.

[గోపాలవర్మ ప్రవేశించును.]

గోపా—(తనలో) పెక్కుదేశంబులు సంచరించి యనేక రాజకన్య లతో ముచ్చటించితిం గాని నా యిచ్ఛకు వచ్చిన మచ్చెకంటి నొక్కర్తె నెక్కడం గానంజాల కిప్పు డిక్కర్ణాటక రాజధానికి వచ్చితిని. ఇక్కడిభూపపుత్త్రి మిగుల సుగుణవతి యని విందును. ఆమెం జూచుట కిది తఱి గాదు. మూఁడవజామున నగరు సొచ్చెదం గాక! గుఱ్ఱమును గడిగి మేఁత కై విడిచి, నేను స్నానాదికృత్యములం దీర్చుకొంటిం గావునఁ గొంతతడ విచ్చట నె యుంట లెస్స. (అని యటునిటు నడిచి) ఆహా; అప్పుడే గ్రీష్మ మెంత యెక్కువ గా నున్నది!

చ. ఘనమలయాచలంబు శ్రమ
ఘర్మహరానిల మాశ్రయించెఁ గా,
మనుజుల డప్పిఁ బాపఁ గల
మజ్జికనీరముఁ ద్రావఁ జొచ్చెఁ, జం

దనమును బూనెఁ గామివరి
తాపనివారణకామినీజన
స్తనయుగ మయ్యో! దుస్సహాని
దాఘదినంబులు దాపరింపఁ గాన్.

(మతికొంచెము పరిక్రమించి, పైకిఁ జూచి) ఓహో! మధ్యాహ్న
మయినదే!!

చ. గగనముమధ్యభాగమునఁ
గ్రాల ఖరాంశుఁడు సార్థకాఖ్యుఁడై
యగములు కేవలాత్మచర
ణాశ్రితభాస్వదనాతపంబు లౌ,
ఖగములు నూత్నపల్లవని
కాయము చాటున దూఱఁ బూనెడున్,
మృగములు మంజుకుంజముల
మెల్లనఁ జొచ్చెడుఁ దాపశాంతికై.

ఆతపతాప మతిశయ మగుటవలన ననతిదూరంబునం గన్పట్టు
చున్న యారమణీయా రామమున విశ్రమించెదను. (కొంచెము
నడిచి, శకునమును సూచించి)

క. కుడిబుజ మదరెడు నిపు డి
క్కడ నేమి శుభంబు నాకుఁ గలుగునొ? మును నా

పడిన శ్రమము లింతటితోఁ
గడ తేఱునొ? భావిఫలముఁ గన లేము గదా!

(అని యించుక నడచి) ఓహో!

గీ. సకలసుమనోయుతం బయి స్వర్గము వలె,
ననిశసౌరభ్యవాస మై యలక పగిది,
శీతలకర మై శశిబింబ రీతి గాను,
దనరు చున్న దీసుందరోద్యానవనము.

ఈమనోహరారామంబునం బ్రవేశించి, కొంతతడవు విహరించెదంగాక! (ముందుం జూచి నిరూపించి) ఎవ్వరో ముగ్వురు వనవిహారము సలుపుచుం బుష్పాపచయంబుం జేయుచున్న వారు! వారలు:—

క. రతిపతినిర్మితకనక
ప్రతిమలో, భూమిగతకంపవర్జితశంపా
లతికలో, తారలో, వనదే
వతలో, కర్ణాటధరణివరపుత్త్రికలో?

కర్ణాటకేశ్వరుం డగుకేశవర్మగారి నగ రిక్కడకు మిక్కిలి సమీప మగుటంజేసి, వీరలు రాజసుతలు గా నోపుదురు. కాని, కేశవవర్మగారి కొకకొడుకు నొకకూఁతురు మాత్రము గల

రని వింటిని. కాఁబట్టి నే నాకనంబడుపొదరింటి మఱుంగున నిలిచి యుండి, వీరి పలుకులవలన నె వీర లెవరో తెలిసికొందుం గాక!
(అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—ఉద్యానవనము.

[ఇందుమతి చారుమతి యను నిద్దఱుచెలులతో మానవతి యథోక్తము గాఁ బ్రవేశించును.]

మధురగతిరగడ.

ఇందు— అనిలచలిత లతి - కావళి యాడెడు
నసఁబోఁడులచం - దంబున నొప్పెడు.

చారు— కదలునిజకిసల - కరవరముల నిను
విదితము గఁ బిలుచు, విటపాళిని గను.

మాన— పెల్లు గఁ బూయుచుఁ - బృథివీఖంబున
మల్లెలు రిక్కల - మాడ్కిఁ జనుం గన

ఇందు— సుమవతి యగులత - సోఁకి మధువ్రత
సమితి యలరి రొద - సలిపెడు మానితే!

మాన— కలకంఠము సహ - కారరసముఁ గొని
లలితరుతమునఁ జె - లంగెను భామిని!

చారు— పున్నాగనికట - మున కేగకు మటు;
సన్నవజల జే - క్షణారో! ర మ్మిటు.

ఇందు— త్వరపడి ముట్టకు - పల్లవ బృందము.
తరుణీమణిరో! - తఱిఁగెడు నందము.

చారు— గుచ్ఛములను నీ - గోళ్ళులఁ దాఁకిన,
స్వచ్ఛత సెడి యవి - వాడు గజగమన!

మాన— కువలయమును గొను - కోరిక విడువుము.
సువదన! యరసి య - శోకముఁ బడయుము.

చారు— నీముఖమును గని - నీట మునింగిన
తామరసంబును - దలఁపకు మంగన!

ఇందు— బోటిరో! నీకె - మ్మోవికి సరియగు
పాటలమును సం - పాదింపం దగు.

మాన— దిరిసెపుఁబువ్వులఁ - దీయుము క్రన్నన;
శిరమునఁ దాలిచి - చేయుము మన్నన.

(అని పువ్వులు గోయు చుందురు.)

గోపా—(ప్రవేశించి, పొదరింటిమఱుంగున నిలిచి యుండును.)

ఇందు—చెలియా, మానవతీ! కుసుమాపచయము నించుక మాని, యిక్కడకు వచ్చెదవా? నీ కొక్కప్రియముఁ జెప్పదను.

మాన—చెలీ! ఇందుమతీ! ఏమి ప్రియ, మేమి ప్రియము? (అని సమీపించును.)

ఇందు—చెలియా! కనుఁ గొనుము. నీవు నాటినమాధవీలతిక బాలరసాలసాలమున నల్లిబిల్లి గా నల్లు కొనుట యే కాక ఫల వతి యై రంజిల్లు చున్నది.

చారు—(సమీపించి) అయ్యో! మానవతికి నింకఁ బరిణయ మయిన ను గా లేదు.

మాన—చాలుఁ జాలు. చారుమతీ! నీచమత్కారము నీకుఁ గట్టి పెట్టుము. చెలీ, యిందుమతీ! నే నీలతికను జూచుటవలన నిపు డమందానందకలిత నైతిని.

ఇందు—చెలియా! తగినవరుని చెంత నున్న నిన్నుఁ గన్న నో మా సంత సమునకు సైతము మితి లేక పోవుం గదా!

మాన—చెలీ! నీవు చారుమతి నె పోలు చున్న దానవా?

చారు—సకియా! మే మే మంటిమి? "నిజ మాడిన నిష్ఠురము" గాఁ బోలు!

మాన—"పెండ్లి పెండ్లి" యని మీ రెల్లపుడు ను బలవరించు చుందురు; మఱి యు నపహాస్యముఁ జేయు చుందురు. కావున మీ చెంత నుండ రాదు. దూర మేగి నాపనిని జేసికొందును.

(అని దూర మేగి, పూవులు గోయు చుండును.)

చారు—చెచ్చెలీ, యిందుమతీ! మానవతి కెంత కినుక గలిగెను!

ఇందు—కనుక మన మిప్పు డారాజపుత్త్రిని డాయక, యిచ్చట నే పూవులు గోయుచుందము. సఖీవత్సలయగు నా మెయలుక లవకాలము మాత్ర ముండును.

చారు—ఔను. (అని యిద్దఱు ను బూలు గోయు చుందురు.)

గోపా—(తనలో) ఆమె కేశవవర్మగారితనయ; వీ రిద్దఱు ను జెలికత్తియలు. అందకత్తెల నెందఱినో కాంచితిం గాని యీనృపనందనిసుందరత్వ మెవ్వరియందుంగాన రా దయ్యె. ఆహా! ఏమి యా మొగముతీరు!

చ. సతతవికాసమున్ మృదిమ
    సారము స్వచ్ఛముఁ గాంచి మించు నీ
యతివమనోహరాస్యమున
    కంబుజదర్పణచంద్రబింబముల్
జత యగు నంచుఁ బల్కునరు
    జాణ యఁటంచు బధు ల్గణింతు రే?
వెతకఁగ జోడు లేదు; పృథి
    వీస్థలి దీనికి పాటి యిద్ది యే.

ఆలోచింపఁ గా:—

గీ. విశ్వరంజనుఁ డగుశశి ప్రీతిఁ గోరి
    కజము నీటఁ దప మొనర్చి కాంతనయన

యుగ్మరూపంబుఁ దాల్చి ముఖోడురమణ
బింబసహవాససౌఖ్యాప్తిఁ బెల్లు దనరు.

భళీ! ఇక్కలికంఠికంఠ మెంతసొం పయినది!

క. తరళాయతనేత్రాకం
ధరమును గాసంత వోల దరముం బ్రీతిన్
ధరధరుఁడు పాణిఁ బూనును,
బరమపవిత మనుచు జనులు భావింతు రెదన్.

బాపురే! ఈయన్నులమిన్న సన్నపున్నడుము గన్నులకుం గనం బడ దన్న నత్యుక్తిగాదు.

క. తరుణీమణిమధ్యముచేఁ
బరాజితము లగుచు సింహవరము వసుమతీ
ధరసుతను; డమరుకంబు త్రి
పురహరు; గగనంబు విష్ణుమూర్తిం జేరెన్.

బళా! ఇమ్మందయానయడుగులచందము నాడెందము నాకర్షించెడు!

క. వరహీరకరదనామృదు
చరణవికసితారుణజలజద్వయము మనో
హరలీలాకృతి నొప్పును
ధరణీతరుణీనవావతంసం బనఁ గాన్.

నే యేల? ఈలతాంగిని సృజించుటచేత నే కంజజుండు విబుధ జ్యేష్ఠుండయ్యె. ఈ బాలామణిని ధరించుటచేత నే ధర వసుంధర యయ్యె. (అని మానవతి నె చూచుచుండును.)

మాన—చెలులారా! చెలులారా! అయ్యో! పలుక రేల? నాపై నలిగితిరా?

ఇందు, చారు—మేము రాజకన్యలమా, హాస్య మాడిన నలుగుటకు? మేము పలుక కుండుటకుఁ గారణము, నీపిలుపు వినఁ బడక పోవుట యె.

మాన—న న్నేకసక్కెము లాడ వల దని, పూవులు గోయు చుంటిం గాని, మీయందలిగితినా? మాటలు మాని, పనిఁ జేయుట వలన నే కదా కావలసిన పువ్వులను వేగము గా సంపాదింపఁ గలిగితిమి!

ఇందు, చారు—దాని కేమి? చెప్పుము, నీ వేల మమ్ముఁ బిలిచితివో?

మాన—"కావలసిన పూవులు చిక్కెను; చాల నే పయ్యెను. కావున నికఁ బురంబునకు వెళ్లుద" మని.

ఇందు, చారు—అ ట్లే చేయుదము. నడువుము. (అని ముగ్గురు నిష్క్రమింతురు.)

గోపా—(తనలో) ఎలనాగ లేగిరి. రాచకూఁతురు మిగులసొగ సయినది నిజ మె; గుణవంతురా లగునో, కాదో? సుగుణము లేనిసుందరత్వ మేల?

గీ. సుగుణములు లేక కేవలసుందరాంగ
దీప్తిచే లోకలోచనతృప్తిఁ జేయు
బాల నెప్పుడు నొల్లఁడు పండితుండు
ముసిఁడిపండును మోదుగుపువ్వు ను బలె.

కనుక నే నిప్పుడె నగరు సొచ్చి, రాజాజ్ఞను బొంది, యమ్ముద్దియ బుద్ధిని బరీక్షించెదను.

(అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—కర్ణాటకరాజభవనము.

[కేశవవర్మమహారాజు ను శ్రుతధృతిమంత్రియుఁ గూర్చుండి ప్రవేశింతురు.]

కేశ—మంత్రీ, శ్రుతధృతీ! మన దేశము వివాదశూన్యము గా నున్నదా? ప్రజ లానందము నొందు చున్నవారు గదా?

శ్రుత—ఆ. వె. దైవభీతి లేక ధర్మంబు విడనాడి
ఖ్యాతిహీను లై దురాశఁ బూను
జనులు గలుగు దేశమున వివాదంబులు
మెండు గాఁ బొసంగు చుండు నధిప!

నీతియుతు లుండుమన దేశంబున వివాదంబులు పుట్టు టెట్టు లి? ఇఁక జనుల సంతోషమా?

క. దుష్టాళిశిక్షణంబు ను
శిష్టావళిరక్షణంబు సేయుచు నీతి
భ్రష్టుఁడు గానినృపాలుఁ డ
రిష్టములను బాపి ప్రజల హృష్టులఁ జేయున్.

ధర్మస్వరూపు లగుప్రభువువారు పరిపాలించు చుండం బ్రజలు మోద మొంద కుందురే?

కేశ—మంత్రీ! సింహళమును జయించి యచ్చట నే యున్న చిరంజీవి వార్త నేఁ డే మయిన ను దెలిసినదా?

శ్రుత—మహారాజా! మనసేనాధిపతిచేతఁ ద్రిప్పి వేయఁ బడిన కొంతసేన నేఁ డె మనరాజధానిం జేరును. మఱి యు నతండు నాపేర వ్రాసినజాబువలన యువరాజుగారు ను దాను ను మిలిగిలినదండుతో నింకఁ గొంతకాల మక్కడ నే యుండి వర్షారంభమున నిక్కడఁ బ్రవేశించుటకు నిశ్చయించుకొనినట్లు తెలియు చున్నది.

కేశ—అట్లే చేయ వచ్చు నని ప్రత్యుత్తరముఁ బంపుము.

శ్రుత— చిత్తము.

కేశ—మంత్రీ! దుష్టుఁడయినసింహళద్వీపేశుఁ డిప్పుడు మనకారాగారమున నుండుట వలన నే నెంత యు సంతుష్టుఁడ నైతిని.

శ్రుత—మహారాజా! మనరాజ్యము నిష్కంటక మయినది.

కేశ—అయినను, మంత్రీ! మానవతిని దలంచినచో, నాచిత్తము చింతాయత్తము గాక మానదు. ఏల యన:—

గీ. పరిణయము లేక జనక మందిరమునందు
మసలు చుండెడుయువతికుమారికంటె
భార మగుపదార్థం బీప్రపంచమందు
వెతకినం గనిపింపదు వేఱొకండు.

శ్రుత—కావున నే వివాహము సేయక యౌవనవతి యైనపుత్రిని మూఁడుసంవత్సరములకంటె నెక్కుడుకాల మింట నుంచఁ దగదని మనువు సూచించెను. పరాశరుఁడు "దశవర్షా భవే త్కన్యా" యని చెప్పి, యౌవనారంభం బె పరిణయంబునకు యుక్తకాలం బని తలంచెను. మఱికొంద "అష్టవర్షా భవే త్కన్యా" యనిరి. ఇట్లు క్రమక్రమము గా మన దేశమున బాల్య వివాహ మనుమతింపఁ బడఁ గా నిప్పటివారు కొన్నిమాసముల యీడు గలపిల్లలకు సైతము బొమ్మలకుం బలెఁ బెండిలి సేయ మొదలు పెట్టిరి.

కేశ—మంత్రీ! బాల్యవివాహంబు నిషిద్ధం బని యె నా తాత్పర్యంబు. మానవతికిఁ బదునాఱేండ్లు గడచువఱకుఁ బరిణయ ప్రయత్నము సేయకుండుట యే దానికిఁ దార్కాణము. ఇఁక నాలస్య మొనర్పక, వరాన్వేషణము కర్తవ్యము.

క. ఘనవంశజుండు, మీానాం
కుని గేరెడుసుందరుండు, కోవిదుఁడు, మహా
ధనబలయుక్తుఁడు, భూపతి
వినుతుఁడు, జామాత యగుట పృథుఫలము గదా!

ఉక్తగుణగణాలంకృతుని నీ వెఱుంగుదు వే?

శ్రుత—మహారాజా! తగుచారులవలన నింతకు మున్నే తెలిసికొని యున్నవాఁడను. భవత్పుత్రికామణికి నన్నిటం దగినవారు కళింగదేశయువరాజుగారె.

కేశ—మంత్రీ! మనము విని యుండ లేదా "ఆయన యేలొకో దేశాటనము సేయుచున్నవాఁ" డని?

శూరసేనుఁడు—[ప్రవేశించి] జయము. జయము. మహారాజా!

కేశ—శూరసేనా! ఏమి సమాచారము?

శూర—ఏలికను దర్శింపఁ గళింగదేశపుయువరాజుగారు హజారము దగ్గఱ వేచియున్నవారు.

కేశ—ఏమి! గోపాలవర్మగారా?

శూర—ఔను. మహాప్రభూ! వారె.

కేశ—మంత్రీ! ఎంతవింత! తాన మాడ నెంచినతీర్థ మెదురుకొని నట్లున్నది!

శ్రుత—మహారాజా! విధివిధాన మనిర్వచనీయము.

కేశ—మంత్రీ! నీ వేగి, సగౌరవము గా నాతనిని దోడుకొని రమ్ము.

శ్రుత—చిత్తము. [అని యేగి, గోపాలవర్మతోఁ బ్రవేశించును.]

కేశ—(లేచి, యతనిని గౌఁగిలించి, పీఠముం జూపించి) యువ రాజా! ఈ పీఠము నలంకరింపం దగు.

గోపా—చిత్తము. (అని వసింప నందఱు ను దమతమపీఠములపైని వసింతురు.)

కేశ—యువరాజా! మీకుఁ గుశలమా? భవదీయసుకుమారశరీరము దేశాటన పరిశ్రమము నొందఁ గారణ మేమి?

గోపా—భవదాశీర్వచనమహిమవలన నాకుం గుశలం బ. మహా రాజా! అవధరింపవలయును:—పూజ్యపాదులగు మానాయన గారు నాకు వివాహము సేయ యత్నింపఁ గా "నేను స్వయము గాఁ గన్యకను జూచి మా టాడినం గాని వివాహ మాడఁ జాల" నని నే విన్నవింప, దానికి వారు సమ్మతించి నన్నుఁ బంపఁ గా నేను బయలు వెడలితిని.

కేశ—కన్యకను గని మా టాడితిరా?

గోపా—దక్షిణాపథమందలిరెండుమూఁడు దేశములు దక్కఁ దక్కిన భరతఖండములోని యెల్లదేశముల కేగి, తత్తద్రాజకన్యలం గాంచి ముచ్చటించితిం గాని నాయిచ్చకు వచ్చినగుణవతి నొక తె నైనం జూడఁ జాల నైతిని.

కేశ—మీరు రాజకన్యలతో సంభాషించుట యెట్లు సంభవించెను?

గోపా—వారలతంద్రులయనుమత్యనుసార మె.

కేశ—వరుఁడు ముందు గాఁ గన్యతో మాటాడి, పిదపఁ బాణి గ్రహణము సేయుట మనలో నెక్కడ నైనం గలదా?

గోపా—లేక పోవచ్చును. నావ్రతము మాత్రము "నేను స్వయము గా నె ప్రసంగించిన సుగుణవతిపాణి నె గ్రహింపవలె" నని.

కేశ—మీయిచ్ఛకు వచ్చినకన్యక యెచ్చటన్ లభింపనిచో?

గోపా—బ్రహ్మచర్య మె శరణము.

కేశ—(జనాంతికము గా) మంత్రీ! కంటివా యీసుందరుని?

చ. సితకరుఁ గేరుమోము, సర
సీజముల న్నగునేత్రము, ల్మధు
వ్రతతతి మించు ముంగురులు,
వజ్రకవాటము మీఱుఱొమ్ము, నా
యతకరితుండముం దెగడు
నం గగుబాహుయుగంబుఁ గల్గు నీ
క్షితిపతిసూనుఁ డొప్పుర్ఝష
కేతుఁడు రూపముఁ దాల్చెనో యనన్.

శ్రుత—(జనాంతికము గా) సుందరత్వము మాత్ర మే కాదు; వీరి పాండిత్యము సైత మసమాన మైనది!

కేశ—నేను న ట్లే విని యున్నవాఁడను.

క. ఉరుపాండిత్యంబు ను సుం
దరతరరూపంబుఁ గలిగి తద్ద యుఁ జనునీ

నరవరతనయుండు మనో
హరపరిమళమిళితహాటకాబ్జము వోలెన్.

శ్రుత—మహారాజా! నేను మొదట నే మనవి చేసి యుండ లేదా "మానవతికి నన్నిటం దగినవారు వీరె" యని?

కేశ—ఈతనికి మానవతి నీయ నాకుం బరమసంతోషం బ. కాని, యితనికోర్కె యెయుక్తముగా లేదు. మానవతితో మాట లాడిన పిదప నితండు పరిణయంబున కంగీకరించు నేని నేహానియుం గలుగదు. అట్లు కాక నిరాకరించు నేని మనకు మానభంగము గాదే?

శ్రుత—మహారాజా! సంశయింపం బని లేదు. వీ రింత గా బరిశీలించుచుండుట సత్కన్యకొఱకుఁ గదా! మానవతిం జూచి ప్రసంగించినచోఁ దల్లావణ్యాసుగుణలుబ్ధులై వీరు దప్పక పెండిలి కీయ కొందురు. సందేహము లేదు. ప్రభువువారు దయ చేసి వీరికోర్కె నెఱవేర్పుఁడు.

కేశ—(కొంచె మాలోచించి, ప్రకాశము గా) యువరాజా! మీ రిక్కడకు రాఁగతం బేమి?

గోపా—మహారాజా! మీ కొకపుత్త్రికామతల్లిక గల దని విని వచ్చితిని. మీ రంగీకరించినచో నామెతో మా టాడీ చూచెద. లేనిచో నాజ్ఞను గైకొని నిజేచ్ఛం జనియెద.

శ్రుత—"మా టాడి చూచెద" ననిన మీయభిప్రాయ మేమి?

గోపా—ఆమెను గని కొన్ని ప్రశ్నము లడిగెదను. వానికి సదుత్తరము లిచ్చు నేని నామెను వివాహ మాడెదను.

కేశ—యువరాజా! రాజులందఱు ను దమతమనుతలతోడ మీరు మా ట్లాడ నంగీకరించి యుండఁ గా నేను మాత్ర మంగీకరింపనా? (ప్రతీహారుం జూచి) శూరసేనా! నీవు మానవతీసమీపమున కీయువరాజుగారిని వెంటం గొని చని యీయన నా మెకుం దెలిపి నామాటలు గా ని ట్లనుము:—“ఇతనిప్రశ్నంబులకుం దగునుత్తరంబు లొసంగ వలెను.”

శూర—చిత్తము. (అని గోపాలవర్మతో నిష్క్రమించును.)

కేశ—మంత్రీ! రమ్ము. ఇంతలో మన మించుక యుద్యానవనవిహారము సల్పి వత్తము.

శ్రుత—చిత్తము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—ప్రాంగణము.

[సఖీద్వయసహిత యై మానవతి గూర్చుండి ప్రవేశించును.]

మాన—సకియా, చారుమతీ! నేఁ డేల నా యెడమబుజ మదరు చున్నది?

చారు—దానిఫలముఁ జెప్పినచో నీవు కోపింతువు.

మాన—చెలీ, యిందుమతీ! వింటివా చారుమతి పలుకును?

ఇందు—విన నే మున్నది? "త్వరలో నీకుఁ బరిణయ మగు" నని చెప్పినరో—

మాన—సరి సరి. ఎల్లప్పుడు మీమది వివాహముమీఁద నే యుండును గాఁ బోలు!

చారు—నీ వట్లందు వని యే శకునఫలముం జెప్ప కుంటిని.

ఇందు—చెలులారా! చూడుఁడు. చూడుఁడు. శూరసేనుని వెంట నొకసుందరుఁడు వచ్చు చున్నవాఁడు!

చారు—(నిరూపించి) అతం డొకరాజనందనుండు.

ఇందు—కన్యాంతఃపురంబున కేల వచ్చు చున్నవాఁడు?

చారు—మానవతి యతని నంగీకరించినచోఁ బెండిలి సేయ మహారాజుగారు నిర్ణయించి యుందురు.

ఇందు—నెచ్చెలీ! ఆసొగసుకాఁడు మనచెలియకు దగినమగం డే నుమ్ము.

చారు—అందుచేత నే మహారాజుగా రాతని నిక్కడకుఁ బంపించిరి.

మాన—చాలు. చాలు. మీయసంబద్ధప్రలాపముల నిఁక గట్టిపెట్టుఁడు; ఆ వచ్చువారు వినఁ గలరు. చెలులారా! లెండు. మనము నిలుచుందము. (అని యందఱు నిలుచుందురు.)

శూర—[గోపాలవర్మతోఁ బ్రవేశించి] రాజకుమారీ! (వ్రేలితోఁ జూపుచు) కళింగదేశపుయువరాజుగా రయినవీరు మిమ్ముం గొన్ని ప్రశ్నము లడుగుదురు. వానికి సదుత్తరము లియ్య వలె నని మహారాజుగా రాజ్ఞాపించు చున్నవారు.

మాన—నాయనగారియాదేశము శిరోధార్యము గదా.

ఇందు—(గోపాలవర్మతో) మీ రీపీఠము నలకరింపుఁడు.

(అని యొకపీఠముం జూపించును.)

గోపా—(కూర్చుండి) బాలికలారా! మీరు ను మీమీపీఠములపైని వసియింపుఁడు.

(అన నబ్బాలలు వసియింతురు.)

చారు—(గోపాలవర్మతో) మీ రడుగవలసినవాని నుపక్రమింప వచ్చును.

గీతములు.

గోపా—ఎల్లవ్రతములలో గొప్ప దేవ్ర తంబు?

మాన—(తలవంచుకొని) అమర జేగీయమానసత్యవ్రతం బ.

గోపా—దానములయందు ఘన మగుదాన మెద్ది?

మాన—అన్న దాన మె యుత్కృష్ట మయిన దెన్న.

గోపా—ధారణీతలంబున దొడ్డవార లెవరు?

మాన—విమలవిజ్ఞానవంతు లె పెద్ద లరయ.

గోపా—వనిత! యీలోకమున భాగ్యవంతు లెవరు?

మాన—ఉన్న దానితో సంతుష్టిఁ గన్న వారు.

గోపా—ఎపుడు నుండవలసి నవి యెవ్వి? సుదతి!

మాన—దేవదేవునిభక్తియు జీవదయ యు.

గోపా—వర్జనీయంబు లెయ్యవి? వనజనేత్ర!
మాన—ప్రాణిహింస యు స్వార్థపరత యుఁ దలఁప.
గోపా—నిత్యసంతోష మెపుడొప్పు? నిర్మలాంగి!
మాన—రాగము ను ద్వేషము ను బాసి సాగునపుడు
గోపా—చెపుము దేనివలన సర్వసిద్ధు లబ్బు?
మాన—చిత్తనిగ్రహమువలన సిద్ధు లొదవు.
గోపా—చేడె! నీదుమానంబుఁ గాఁపాడువారు
జగతి నెవరు? వచింపు సంశయము విడిచి.
మాన—కాంత తనమానమును దా నె కాచుకొనఁగ
వలెను గాక పరులు గావఁ గలరె యెందు

గోపా—తనలో ఏమి యిబ్బాలబుద్ధికుశలత! నేఁ జూచినరాజకన్యలలో నీమెను బోలినది యొక్కతె యును లేదు. ఈమె లక్షణములం బట్టియాలోచించిన నీపె మిగులగుణవంతురా లని యేతోఁచు చున్నది. కావున నీమె నె పరిణయంబుఁ జేసికొని సుఖింతును గాక! (ప్రకాశము గా) కన్యామణీ! నీసుగుణ సౌందర్యముల చేత నాచిత్త మాకృష్ట మయినది. కనుక నిన్ను వివాహ మాడ నంగీకరించితిని. ఈనాసమ్మతి నిప్పుడె మీనాయనగారి కెఱిగించెదను.

మాన—(సిగ్గుచేతఁ దల వంచుకొనును.)

గోపా—(పశ్చిమదిశను జూచి) బాలామణీ! చూడుము. చూడుము.

మ. దినరా జింద్రదిశాసతీవిరహజా
ధిన్ సైఁప లే కాత్మరా
గనిధానంబుఁ బ్రదోషరాగమిష లో
కంబంతటం జల్లి, దూఁ
క నపారాపరవార్ధి, నంబుకణముల్
ఖం బంటుచుం జుక్కలై
తనరెన్; రిక్కలపిండుఁ జుక్కలనుచే
తార్కాణ మా దీనికిన్.

కావునఁ గాలోచితకార్యంబులకొఱ కిపుడు విడిదికిం జనియెదను.

(అని శూరసేనునితో నిష్క్రమించును.)

చారు—మానవతీ! మావి యసంబద్ధప్రలాపములా?

ఇందు—చెలియా! శకునము ఫలితమునకు వచ్చినదా?

మాన—(పలుకక తల వంచుకొని యుండును.)

ఇందు—చెలియా! పలుక వేమి?

చారు—నృపసుతహృతచిత్త యగుసకియకు మనమాటలు వినం బడకున్నవి. ఇందుమతీ! కనుంగొనవా యాస్వేదపులకయుతగండయుగమును?

మాన—(తనలో) వీరికోడిగము లంతకంతకు హెచ్చుచున్నవి. కనుక వీరి మనంబులను బ్రసంగాంతరంబునకుం ద్రిప్పి చూచెదను.

(ప్రకాశముగా) చెలులారా! మీయొగతాళిపలుకుల నించుక విడిచి, తూర్పుదెసం గనుఁడు:—

చ. సకలకలాయుతుం డగుచుఁ

జంద్రుఁడు మిన్ను నలంకరింప ది

క్ప్రకరము తెల్లగా నెసఁగి

గంద మలందినమాడ్కిఁ దోఁచెఁ; గా

ముకమన మట్లు నీరనిధి

పొంగెను; గల్వలు లోకలోచనా

ళికరణిఁ దెల్వి నొందె; వఱ

లెం గడు రాత్రి చిరంటిరీతి గాన్.

ఇందు—చెలీ! భర్త సూర్యాస్తమయమును వర్ణించె నని నీవు చంద్రోదయమును వర్ణించితివా?

చారు—చెలియా! నీపద్యముయొక్క మూఁడవపాదమును

"మేటికడలి పొంగె నామనము

తేవగ" నని పఠియింపక,

"కాముక మన మట్లు నీరనిధి

పొంగె" నని యేల పఠించితివి?

ఇందు—ఓహో! ఇన్నినాళ్లకా "రాత్రి చిరంటిరీతి గాఁ" దోఁచుట?

మాన—(లేచి) చెలులా! మీకోడిగపుమాటల నెప్పటికి న్మానరు. కాన నిఁక మీచెంత నుండ రాదు. అమ్మగారిసన్నిధి కేగెదను.

(అని నిష్క్రమించును.)

ఇందు } చారు } —మగనిం జూచినమాత్రాన మమ్ము విడుచుట న్యాయమా? చెలియా! నీవు మమ్ము నెడ పెట్టిన ను, నిన్ను మే మెడఁ బాయము సుమ్ము.

(అని యామె వెంట నేగుదురు.)

ఇది ద్వితీయాంకము.



# తృతీయాంకము.

---

ప్రదేశము—రాజమార్గము.

[ఒకదెసనుండి శూరసేనుండు ను వేఱొకదెసనుండి వీరసేనుండు ను బ్రవేశింతురు.]

శూర—ఏమోయీ, వీరసేనా! సింహళమునుండి యెప్పుడు వచ్చితివి?

వీర—శూరసేనా! ఇదె, వచ్చు చున్నవాఁడను.

శూర—యువరాజుగారు మొదలయినవా రందఱికిని క్షేమమా?

వీర—అందఱు ను సుఖముగా నున్నవారలు.

శూర—యువరాజుగా రిచ్చటున కెప్పుడు విచ్చేయుదురు?

వీర—ఇంకఁ బదిదినంబులు పట్టు నని తోఁచెడిని.

శూర—వింత లే వయిన ను గలవా?

వీర—ఏమి యును లేవు. యువరాజుగారిసందేశముం గొని వచ్చితిని. దేవిగారిని దర్శింప నిది సమయమా!

శూర—ఏ దేవిగారిని?

వీర—ఏమోయీ! అట్లడుగు చున్నవాఁడవు! గుణవతీదేవిగారు దక్క నేకపత్నీవ్రతు లయినమనమహారాజుగారికి వేఱు దేవేరులు గలరా?

శూర—మనమహారాజుగారికిం గల రంటివా!

వీర—అట్లయినచో, నీయభిప్రాయ మేమి?

శూర—"గుణవతీదేవిగారినా? లేర మానవతీదేవిగారినా?" యని,

వీర—ఏమీ! రాజకుమారిగారిని దేవిగా రను చున్నవాఁడవు!

శూర—దేవిగా రయిన ను, దేవిగా రన వలదా?

వీర—అ దెప్పుడు? శూరసేనా! దయచేసి, సవిస్తరము గాఁ జెప్పుము.

శూర—సుగుణములు గలచక్కనిరాచకన్నెను గోరి, కళింగదేశపు యువరాజుగారు పెక్కుదేశంబులు దిరుగుచు నిక్కడకు విచ్చేసి, శ్రీమానవతీహృత్తచిత్తు లగుటంజేసి, పరిణయోత్సవము జరిగి నేఁటికిఁ బదునైదుదినము లయ్యెను. జాయతోడ యువరాజుగారు స్వదేశమున కేగఁ ద్వర పడుటవలనఁ దత్ప్రయాణోచిత కార్యంబులను మహారాజుగా రిపుడు చేయించు చున్నవారు.

వీర—ప్రయాణ మెపుడు?

శూర—ఇఁక రెండుగడియలలో.

వీర—ఆలాగా? వధూవరులతో నెవ రెవ రేగుదురు?

శూర—రెండుగుఱ్ఱములు దప్ప, వెళ్లువారు మ ఱెవ్వరు ను లేరు.

వీర—అశ్వపాలకులయిన ను వెళ్లురా?

శూర—వెళ్లరు.

వీర—కారణ మేమి?

శూర—సేవకులు వెంట నున్నచోఁ బ్రయాణంబునకు విలంబము ఘటిల్లు నఁట. కావున నిప్పుడు వధూవరులు మాత్ర మె బయలు

చేసి, కళింగదేశమును జేరిన తోడనె జాబు వ్రాయుదు రఁట. అంతట నరణము గా నొసంగఁ బడినసలక వస్తుసహితచతురంగ సైన్యము పంపఁ బడు నఁట.

వీర—దూరదేశమునకుఁ దోడు లేకుండ వధూవరులను బంపుట యుక్తము గా దని తోఁచెడిని. మహారాజుగా రేమి సెల విచ్చిరి?

శూర—సమ్మతించిరి. అల్లునియుల్లముం దల్లడింపఁ జేయుదురా?

వీర—మహారాజుగా రిప్పు డెచ్చట నుందురు?

శూర—దేవిగారిమందిరమున నుండి, పుత్త్రీప్రయాణప్రయత్నముం జేయించుచుందురు.

వీర—రమ్ము. మన మచ్చటునకు వెళ్లుదము.

శూర—నే నక్కడ కే కదా వెళ్లు చున్నవాఁడను. నడువుము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—గుణవతీదేవిమందిరము.

[గుణవతీదేవి యుఁ గేశవవర్మ యు మానవతి యు సఖులు ను బ్రవేశింతురు.]

గుణ—అమ్మా, మానవతీ! నీవు బుద్ధిమంతురాల వయిన ను నత్తవారి యింటి కేగు చున్న దాన వగుటచేఁ గొన్ని నీతులను నీకుఁ జెప్పం దలంచితిని. వినుము.

మాన—అమ్మా! అనుహితురాల నై యున్నదానను.

గుణ—క. తనయా! మగఁడే దైవం

బనువిశ్వాసంబుఁ బూని యతనిమననుచో

ప్పున నెపుడు సంచరించుచుఁ

గను మిహపరలోకములను ఖ్యాతిన్ బ్రీతిన్.

మాన—అట్లే సంచరించెద. జననీ!

గుణ—క. సవతులయెడ స్నేహమ్ము, గు

రువులయెడ న్భక్తి, ననుచరులయెడ దయ, బం

ధువులయెడ నాదరమ్ము, శి

శువులయెడం బ్రేమ నుంచు సురుచిరగాత్రీ!

మాన—అమ్మా! తప్పకుండ నుంచెదను.

గుణ—క. ఉర్వీశు రాణి నే నని

గర్వింపకు మమ్మ వికచకంజదళాక్షీ!

సర్వప్రాణులు జగతిన్

సర్వేశునినయనమునకు సములు దలంపన్.

మాన—గర్వంబు నెన్నటికిం బూనను.

గుణ—క. కష్టసమయమున ధైర్యముఁ,

బుష్టిగ ధన ముండుసమయమున వినయంబున్

శిష్టజనేప్సిత మగుసం
తుష్టి నిరంతరము నొందు తోయజవదనా!

మాన—అలాగున నె పొంది యుండెదను.

గుణ—క. ఉరుతరభగవద్భక్తిని
వరగుణములఁ గలిగి యత్తవారికి మాకుం
జిరకీర్తిగౌరవంబులు
ధర నొనఁగూర్పుముసతీమతల్లి! కుమారీ!

మాన—అమ్మా! అవశ్య మారీతి నే చేయుటకు సర్వథా ప్రయత్నించెదను.

గుణ—అమ్మా! నేఁ జెప్ప నెంచినవి యివి యె. మీనాయనగారింక నేమి సెలవిచ్చెదరో?

కేశ—అమ్మా, మానవతీ! మీయమ్మనుడువులను లెస్స గా జ్ఞాపకముంచుకొను మనుటకంటె నేఁ జెప్పనది వే ఱే మున్నది? లెమ్ము. ప్రయాణసమయము సమీపించెను.

మాన—(లేచి) అమ్మా! ప్రణమిల్లుచున్నదానను. (అని మ్రొక్కును.)

గుణ—నాథాదరము గలిగి వర్ధిల్లుము. (అని కౌఁగిలించును.)

మాన—(కౌఁగిలించి) అమ్మా! మిమ్ము విడిచి యేగుచున్నకూఁతును మఱవకుఁ డనుటకు నాకు సిగ్గగుచున్నది. (అని కన్నీరు విడుచును.)

గుణ—అమ్మా! నన్ను నేను మఱచినప్పుడు కదా నిన్ను మఱచుట.

[అని చెక్కులు ముద్దాడుచుఁ గన్నీరు విడుచును.]

మాన—(గద్గదస్వరముతో) అమ్మా! నాయెడఁబాటువలన భోజనాదులను మాని విశీర్ణత నొందకుఁడు.

గుణ—(కన్నీటితో) నన్నుఁ గూర్చి చింతింపకుము. మగనిసేవ సేయుచు ముదమున సమయమును గడుపు చుండుము.

మాన—నాయనగారూ! ప్రణమిల్లు చున్నదానను. (అని మ్రొక్కును.)

కేశ—అమ్మా! వీరమాతవు కమ్ము. (అని లేవ నెత్తును.)

మాన—(కన్నీటితో) నాయనగారూ! అన్నయ్యను జూడ లేకపోయితి ననుచింత నన్ను మిగుల వేధించు చున్నది.

కేశ—అమ్మా! అడలకుము. కొంతకాల మయినపిమ్మట నాతనిని నీకడకంపెదను.

మాన—నాయనగారూ! మరల నే నిక్కడ కెప్పుడు వత్తును?

కేశ—కొన్ని నెలలఁ గడచినపిదప, నేను నీయన్నను గళింగదేశంబునకుం బంపించి, నీమగనితోడ ని న్నిక్కడకు రప్పించెదను.

మాన—ఇది సత్యమా?

కేశ—అమ్మా! నే నెప్పుడయిన నసత్యముం బలికితి నే?

మాన—(సఖులను గౌఁగిలించి) చెలులారా! లోగడ మీయెడ నే నొనర్చినతప్పులను మఱచి, నన్ను మఱవకుఁడు.

(అని కన్నీరు విడుచును.)

ఇందు
చారు } —చెలియా! నిన్ను మఱచి యుండఁ గలమా? నిన్ను విడచి బ్రదుకఁ గలమా? (అని శోకింతురు.)

మాన—(కన్నీటితో) నన్ను మఱచి యయినను, మీరు సుఖముగా నుండుఁడు. అంతే నా కోరిక.

ఇందు
చారు } —అవి యేటి మాటలు? చెలియా! నిన్నును నీ స్నేహమును గలలో నయిన న్మఱవం జాలుదుమా? (అని శోకింతురు.)

శేక—ఇందుమతీ! చారుమతీ! మీరు గదా మానవతికి ధైర్యముం జెప్పెడివారు. అది యుం గాక, ప్రయాణసమయమున నిట్లు శోకించుట యుక్తమా?

ఇందు
చారు } —మహారాజా! మమ్ము క్షమియింపవలయును. మేము సమయము నెఱుంగక పోలేదు. కాని, పొంగి పొరలి వచ్చుచున్న సఖీవిరహశోకాంబురాశి నాఁపం జాలకున్నవారము.
(అని కన్నీరు దుడుచుకొందురు.)

మాన—అమ్మా! ఈనాసఖులను నాకు మాఱుగాఁ జూచుకొనుచుండవలెను. (అని చెలులచేతులను దల్లిచేతిలో నుంచును.)

గుణ—అమ్మా! నన్నెవ్వరి కప్పగించి వెళ్లుచున్నదానవు? (అని శోకించును.)

శేశ—దేవీ! ఇట్లు శోకించెద వేలా?

మ. సుతుఁ డాసింహళనాథు గర్వధరముం
జూర్ణంబు గాఁ జేసి శా
శ్వతకీర్తీందుముఖిస్వయంవరమున
న్వర్ధిల్లెడున్ హృష్టుఁడై,
సుత యుక్తేశవివాహవైభవమునన్
శోభిల్లెడున్ గావునన్
శతపత్రాక్షిరో! వంత నొందఁ దగునే?
సంతోషముం బొందవే.

గుణ—(కన్నీరు దుడుచుకొనుచు) నాథా! ఇది నా కమితానంద సమయ మె. అయినంగన్నకడు పగుటం జేసి, వియోగకాలం బున నది గరఁగక మానదు.

కేశ—అమ్మా, మానవతీ! నడువుము. దేవీ! రమ్ము. అమ్మాయిని గొన్నియడుగులు సాగనంపి వత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—కాననము.

[మానవతి యు ను గోపాలవర్మ యు ను శయనించి ప్రవేశింతురు.]

గోపా—(లేచి కూర్చుండి నలుదెసలు గని తనలో) ఓహో! అప్పు డె ప్రభాతసమయ మాసన్న మయినది! (ప్రకాశము గా)

ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ! లెమ్ము. లెమ్ము. (అని మానవతిని దట్టి లేపును.)

మాన—(లేచి కూర్చుండి) ప్రాణేశ్వరా! ఏమి సెలవు?

గోపా—ప్రాణేశ్వరీ! ఇంకం బండుకొని యుండుట యుచిత మా? చూడుము:—

చ. ముగుదరో! నిష్కళంకపరి
పూర్ణనిరంతరభాసమానుఁ డై
తగుభవదాస్యచంద్రముని
దాఁ బరికించి కళంకి యెంత యున్
వగఁ గొని పశ్చిమాంబునిధి
వైళము క్రుంకెను; మానవంతు లీ
జగమున మానభంగమును
సైఁపక క్రుంకుట యుక్త మౌఁ గదా.

మఱియు ను

గీ. కాంతరో! త్వదీయాధికకాంతిరాజి
త మగునఖపంక్తిముందఱఁ దారకాళి
యడర లేక కను మొఱంగఁ దొడఁగె నొక్కొ?
ప్రబలశూరుని ముందటి పంద పగిది.

మాన—కవిరా జగుప్రాణేశ్వరునికల్పనాచమత్కృతిఁ బొగడం దర మా?

గోపా—ప్రాణేశ్వరీ! కల్పన గాదు; యథార్థము నే చెప్పితిని.

కనుంగొనుము:—

ఆ. వె. సుప్తజనులలేప శ్రుతిహితము గ స్వర
ములను బాడఁ దొడగెఁ బులుగులగమి;
గాత్రములను దాఁకఁ గడఁగెను గమ్మని
చల్లగాలి మెల్లమెల్ల గాను.

అయినం గొందఱుసోమరులు మేలుకొనక, తమమునుంగులను సవరించుకొంచు నిద్రించు చుందురు.

మాన—ప్రాణేశ్వరా! లేవ లేక, స్వభావానందమయ మగునిట్టిసమయమును వ్యర్థము గాఁ బో నిచ్చువా రదృష్టహీనులు గా రే?

గోపా—అందులకు సందేహ మా? ప్రాణేశ్వరీ! చూడు చూడు:—

గీ. కాలకరివరదుఁడు వేయుగాఢతిమిర
చక్రనక్రవిచ్ఛేదకచక్ర మనఁ గ
నరుణబింబంబు గగనంబునందుఁ దోఁచె
నలినిముద మంద భువనంబు దెలివి నొంద.

ఆరయ నరుణకిరణాచ్ఛాదిత మయి ప్రపంచము బంగారు మెఱుంగుఁబూతం బొంగారినట్లు తోఁచెడిని.

మాన—(నలుదెసలు పరికించి) ప్రాణేశ్వరా! ఇచ్చటున కనతి దూరంబున నొకపట్టణంబు గనం బడు చున్నది. దాని పే రేమి?

ఇది యేదేశము? ఇక్కడకు మనదేశ మింక నెంతదూర ముండును?

గోపా—ఆకనఁ బడునది కనకపురి యను నొక సామాన్యపత్తనము. ఈయది ద్రావిడదేశము. ఎంతదూరము వచ్చితిమో యించుమించు గా మ అంతదూరము మన మేగ వలసి యుండును.

మాన—మనదేశమున కిది యా మార్గము?

గోపా—ఇది యు నొకటి.

మాన—ప్రాణేశ్వరా! అదె, మంచినీరు గలయొకసెలయేఱు. మన మక్కడ కేగి కాల్యకార్యంబులం దీర్చుకొని కనకపురికిం జని యొకబసఁ జూచుకొని భోజనాదులం గావింతము.

గోపా—పట్టణంబులందు వెస న్బస దొఱుకుట దుర్లభంబు. ప్రాణేశ్వరీ! మనమిపుడు కనకపురికిం జనుదు మేని, నిష్కారణము గా మనభోజనసమయ మతిక్రమించును. కాఁ బట్టి మన మాసెల యేటిగట్టున దట్ట మగుకొమ్మలతో నొప్పుచున్న మఱ్ఱిచెట్టుక్రింద విడిసి భోజనానంతరము కొంతతడవు విశ్రమించి సాయంసమయమునం బురిం జేరుదము.

మాన—మనయొద్ద భోజనపదార్థము లెవ్వి యు ను లేవు.

గోపా—ప్రాణేశ్వరీ! నీవు మజ్జనముం గావించునంతలో నేను గనకపురి కేగి సమస్తపదార్థములం గొని తెచ్చెదను. నీవు వంట ముగించునప్పటికి నాస్నానాది కృత్యములు నెఱవేఱును.

మాన—ప్రాణేశ్వరా! మిమ్ము విడిచి, నే నొక్కతె నిక్కడ నుండఁ జాలను.

గోపా—రాజపుత్త్రీ! భీతిల్లకుము. నే నొక్కగడియలో నే కదా మరలి వత్తును.

మాన—నే భయంపడుదానఁ గాను. "నిర్జనప్రదేశమున రమణి యేకాకిని గా నుండరా" దని నావిన్నపము.

గోపా—నీ డెందంబునం దట్టిసందియంబు నొందకుము. ఈనుంత సేపులో నే మగుసు? ప్రాణేశ్వరీ! నాహయము గడు బడలి యుండుట న్నీదానిం గొని చనియెదను.

మాన—ప్రాణేశ్వర! నే విన్నవించుదానం గాని శాసించుదానం గాను.

గోపా—ప్రాణేశ్వరీ! లెమ్ము ముందు గా మన మాఃటపటపికడకు వెళ్లుదము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—శంకరగుప్తునికూటము.

[శంకరగుప్తుఁడు గూర్చుండి ప్రవేశించును.]

శంక—(తనలో) నేను గా వలసినంతకంటె నెక్కుడుధనమును సంపాదించితిని. నాపాటిధనవంతుం డీపురంబున మఱియొకండు

లేఁడు. కావున నీపురజను లందఱును నాకు వశ్యులు. ఆహా! ధనప్రభావము నే మని కొనియాడఁ గలను?

ఉ. విత్తము సర్వసాధకము,
విత్తము సంతతవాంఛనీయమున్,
విత్తము రాజపూజితము,
విత్తము మానవకోటివశ్యమున్,
విత్తము ముఖ్యదైవతము,
విత్తము శక్తిముదాయశోదమున్,
విత్తము లేనివారు పృథి
విన్గని యుండి యు లేనివారె కా!

ఇట్టిధనము గలనాకు నంత గా విద్య లే కున్నం గొఱంత లేదు. నా కున్ననైపుణ్యా మె చాలును.

గీ. ధనము లేనిమానవులు విత్తంబుకంటె
విద్దె ఘన మైన దనియెద రద్ది కల్ల;
"కోటివిద్యలు నేర్చుట కూటికొఱ కె"
యనెడుసామెత జగతిఁ బ్రఖ్యాతము గద!

అది యుం గాక, యారయ నేరీతి నైనం బూరుషుం డీలోకం బునం బొందం గోరునవి కాంతాకనకము లె. కాఁ బట్టి యె మతిమంతు లిట్లు నుడివిరి:—

క. సారంబు లేనియీసం
సారమున సతీధనము లె సారము లగుటం
బూరుషుఁడు వాని కై తన
గారాబపుబుసురు నేని కానుక యొసఁగున్.

ప్రాణాధికము లయినభామాభర్తంబులలో భామ యె యధిక మయినది. ఏల యన:—

క. వనితకొఱ కె ధనసంపా
దనమును వ్యయమును జనుండు దమిఁ జేయుటచే
వనితావిత్తంబులలో
వనిత యె యీలోకమందు వాసిం గనెడున్.

నిక్కపము గా నెంతయెక్కువ విత్త మున్న ను మక్కువ గల చక్కనిచాన యొక్క తె నాపక్క లేమి న్నా కొక్కిం తేని హాయి లేదు. సుందరమందయానం బొందనివాఁడు రా జైన నేమి? రెడ్డియైన నేమి? ధనవంతుఁ డైన నేమి? దరిద్రుఁ డైన నేమి? పండితుం డైన నేమి? పామరుం డైన నేమి? వానికి సుఖము మాత్రము సున్న. సౌఖ్యము లేక బ్రతుకుటకంటెఁ జచ్చుట యె లెస్స. కావున నాస్వ మ్మంత యు వ్యయ మ్మయిన నగుం గాక! నే నొక్కచక్కనిచక్కెరబొమ్మను సంపాదించి సుఖించెదను. ఎట్లు సంపాదింప నగును?

(అని యాలోచించు చుండును.)

ముద్దుసామి——[ప్రవేశించి] అయ్యా! చక్కనివాఁ డొక్కఁడు గుఱ్ఱము నెక్కి వచ్చి మనగుమ్మముదగ్గఱ వేచి యున్నవాఁడు.

శంక——ముద్దుసామీ! మనసాలయందతనిగుఱ్ఱము నుంచి, యాతనిని లోనికిం బంపుము.

ముద్దు——చిత్తము. (అని నిష్క్రమించును.)

గోపా——[ప్రవేశించును.]

శంక——(లేచి) అయ్యా! వందనము. (పీఠముం జూపించి) ఈ పీఠమున నసీయింపుఁడు.

గోపా——(ప్రతివందన మాచరించి కూర్చుండును.)

శంక——(కూర్చుండి) అయ్యా! మీది యే దేశము? మీ నామము?

గోపా——నేను గళింగదేశపుయువరాజును. నన్ను గోపాలవర్మ యందురు. మీ నామధేయము?

శంక——నేను శంకరగుప్తుఁడను. మీ రేకాకి గా నిటకు రాఁ గతంబేమి?

గోపా——మంచిగుణములు గలవిరిఁబోఁడి నొకతెను సంపాదింప నెంచి నే ననేక దేశములు దిరిగి తిరిగి వేసారి యెట్టకేలకు కర్ణాటకదేశముం జేరి తద్రాజపుత్రిని మానవతీనామ్నిని జూచి మోహితుండనై వివాహంబుఁ జేసికొని యామెను వెంటం గొని నిజదేశంబున కేగుచు నిప్పట్టణపుదక్షిణదిక్కున నున్న సెలయేటిగట్టున విడిసి కొన్నివస్తువులు గొన నిటకు వచ్చితిని. నేను వేగము గా నేగ వలెను. నృపనందన యేకాకిని గా నున్నది.

శంక — నే నన్నివస్తువుల నొక్కనిముసములో నిచ్చెదను. నాకంటె గొప్పవర్తకుం డీప్పురంబున మఱియొకండు లేఁడు. అయ్యా! మీరు వధూవరులు దప్ప, మఱెవ్వరు ను రా లే దా?

గోపా — ఇపుడు మా వెంట మ ఱెవరు ను రా లేదు.

శంక — (తనలో) ఈతనిపలుకులవలన నితనివనిత గుణవతి యు రూపవతి యు నని తెలియు చున్నది కదా. వెతకం బోయినలత పాదమునకుఁ జుట్టుకొనినట్లు నా కీమె తటస్థించెను. ఈమెను విడువ రాదు; ఎ ట్లయిన ను దక్కించుకొనవలెను. (కొంచె మాలోచించి) సరి. ఇట్లు చేసెదను. (ప్రకాశము గా) అయ్యా! మీరు క్షత్రియులరు. కనుక వెంట నెవరిం గొనక యె పయనము సేయ సాహసించితిరి.

గోపా — ఇ దొకసాహసకృత్య మా?

శంక — అయ్యా! మీచిటికెనవ్రేలియుంగరము నొకసారి చూడ నిండు.

గోపా — (ఉంగరమును దీసి యిచ్చును.)

శంక — (చేత నుంచుకొని చూచుచు) ఇది మిక్కిలిచక్క గాఁ జేయఁబడినది. దీనిం జూడం జూడ నిట్టిదానిం జేయించుకొన నాకుఁ గోరిక గలుగు చున్నది. ఇక్కడ కించుకదూరంబున మంచిపనివాఁ డొకఁడు గలఁడు. అయ్యా! సెలవిచ్చెద రా? వానికిం జూపింప దీనిం బంపించి, మరల నిప్పుడె తెప్పించెదను.

గోపా — విలంబ మగు నే మో?

శంక — మీరు సంశయింప నక్కఱ లేదు. మీకుఁ గావలసి యున్న వస్తువులను నేను సమకూర్చునంతలోనె యీ యుంగరము వచ్చును. (గుమ్మమువంక గని) ముద్దుసామీ! ముద్దుసామీ!

ముద్దు — [ప్రవేశించి] అయ్యా! ఏమి సెలవు?

శంక — (లేచి, వానితో జనాంతికము గా) ఓయీ! నీ వొక్క పనిని మిక్కిలి నేర్పుతో నొనర్ప వలెను. దానిం జేయ నీవె సమర్థుండవు.

ముద్దు — (జనాంతికము గా) తప్ప కుండఁ జేసెదను. సెల విండు.

శంక — (ఉంగరమును వానిచేతి కిచ్చి) దీనిం గొని నీవు వేగ నేగి యల్ల సెలయేటి గట్టున నున్న రాచకన్నెకుం జూపించి యిట్లు పలుకుము:— "అమ్మా! వస్తువులం గొనఁ బోయిన నీమగండు గుఱ్ఱముమీఁదినుండి నేలం బడుటవలనఁ గాలు విఱిగి నెగులం బొగులు చుండఁ గా నే నాతని నొకయింటం బరుండం జేసి నాచేతనయినయుపచారములను సల్పితిని. ఆతం డీయుంగరంబు నానవాలు గాఁ జూపించి నిన్నుం గొని రా నన్నుం బంపెను. రమ్ము. వేగ వెళ్లుదము." అని నీ నేర్పంతయుం జూపించి యామెకు నమ్మకముఁ బుట్టించి సమస్తవస్తువులతో నామెను దెచ్చి పెరటిదారిని మాయింట నుంచి నాకడకు రమ్ము.

ముద్దు — ఇ దెంతపని? మీయిచ్చకు వచ్చిన ట్లె యగును.

శంక — (ప్రకాశము గా) ఓయీ! ఈ యుంగరమును జూపించి వేగము గాఁ గొని రమ్ము.

ముద్దు--(ప్రకాశము గా) ఇది గో తెచ్చు చున్నవాఁడను.

(అని నిష్క్రమించును.)

శంక--(కూర్చుండి) అయ్యా! మీ కేయేవస్తువులు గా వలెను?

గోపా—గోదుమపిండి దోఁటుకు నా?

శంక—పిష్టము మిగుల గురుత్వము. "అన్నా దష్టగుణం పిష్ట" మ్మనువచనము ప్రసిద్ధము కదా. మఱి కాక సేయును. పయన మున నున్నవారి కది జొత్తి గాఁ బనికి రాదు. మంచిబియ్యము నిచ్చెదను.

గోపా—కందిపప్పు వలయును.

శంక—గుణమునఁ గందిపప్పు గోదుమపిండిని బోలుట యే కాక, వేగము గా నుడుకదు. "ముద్గదాళీ గదవ్యాళి" యనుట మీ రెఱింగి యుందురు. కాఁ బట్టి పెసరపప్పును గొనుఁడు.

గోపా—ఆవుపెరుగు చిక్క నా?

శంక—రోగు లావుపెరుగును గోరుదురు. మీ క దేల? "మాహిషం చ శరచ్చంద్ర చంద్రికాధవళందధి" యను కాళిదాసవచనమును మీరు విని యుందురు. కావున గేదెపెరుగును దెప్పింతును.

గోపా—హైయంగవీన మబ్బు నా?

శంక—ఎన్నినాళ్లైనదయినను, మాయింటినెయ్యి సువాసన గలది సుండీ.

గోపా—అరఁటికాయలు గా వలెను.

శంక—"కదళీ న కదాచన" మనుటం జేసి, పొట్లికాకరకాయ లొసంగెదను.

గోపా—పచ్చడికిఁ గొబ్బరికాయ—

శంక—"కపిత్థం సర్వదా పథ్య" మ్మనుటవలన వెలగపండు గూడ దా?

గోపా—(తనలో) ఆపద్యపాదములను విపరీతము గా వ్యవహరించుంట మాని, లేనివస్తువులు లే వని స్పష్టము గాఁ జెప్ప రా దా? ఉన్నవాని నె యొసంగ రా దా? ఆహా!

క. కన దుర్జనుండు నిజమత
మున కనుకూలము గ శాస్త్రముల కర్థములన్
బెను నేర్పున నొనరించుచు
జనులను భ్రమియింపఁ జేయ సమకట్టుఁ గదా!

శంక—అయ్యా! మీ రాలోచింప నక్కఱ లేదు. హితకరము లగు సమస్తవస్తువులను సంపాదించి యిచ్చి మిమ్ముఁ బంపెదను. రండు. మన మిపుడు లోనికి వెళ్ళుదము. ముద్దుసామి మీయుంగరము నుు దెచ్చునంతలో మాయింట నున్న వింతసరకులను మీరు గన వచ్చును.

గోపా—విలంబము గాదు కదా

శంక—కాదు. దయసేయుఁడు. మీపాదధూళిచే మ న్మందిరంబు పవిత్రం బగుఁ గాక!

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

ప్రదేశము—శంకరగుప్తుని గృహము.

[శంకరగుప్తుఁడును ముద్దుసామియు నిలిచి ప్రవేశింతురు.]

శంక—ముద్దుసామీ! నీ నేర్పు నే మని కొనియాడుదును? ఎంతలో నమ్మించి యామెను గొని వచ్చితివి! నీయాఋణంబును దీర్చు కొన లేను జుమీ!

ముద్దు—మీ ర ట్లనఁ గూడదు. సేవకుఁడను. మీయిచ్చకు వచ్చు విధముగ నొనర్చుట నాకు విధి.

శంక—ఆవెఱ్ఱిరాజును బాగుగా వంచించితిమి!

ముద్దు—అయ్యో! ఇంక నామె యక్కడ నున్న దనుకొని, యాతఁడు వే వేగ నేగుచున్నవాఁడు!

శంక—పోనీ. ఇఁక నతనిమాట మన కేల? ఆమెగుఱ్ఱమును మేడ పెరటిసాలలోఁ గట్టించితి వా?

ముద్దు—అక్కడనె కట్టించితిని.

శంక—ఓయీ! మనకుఁ బరస్త్రీహరణదోషము లేదు సుమీ!

ముద్దు—అ దెట్లు?

శంక—ఆతని కీమె భార్య గాదు.

ముద్దు—మ ఱే మగును?

శంక—ఏమి యుఁ గాదు.

ముద్దు—అట్లయినచో వీరిద్దఱు ను గలసి పయనము సేయుటకుఁ గారణ మేమి? "నీమగనికాలు విఱిగిన" దని నేఁ జెప్ప నీ మె యేడ్చుచు నిక్కడకు రాఁ గతం బేమి?

శంక—వివాహ మగు ననునాస యె యారెండింటికిం గారణము.

ముద్దు—ఇంకం బెండిలి గా లే దా?

శంక—కా లేదు?

ముద్దు—ఏల కా లేదు?

శంక—ఈమె యిప్పుడు నాతో స్పష్టము గాఁ జెప్పినదానిని వినుము. ఈవనిత కొక వ్రతము గలదు. దానిని బూర్తిసేయించు వానిని దప్ప నితరుని వరింపమి యె యీమె ప్రతిన. అది విశేషవిత్తసాధ్య మగుటం జేసి, దానిని ముగింప నెవ్వరు ను బూనుకొన కుండిరి. దానిం బరిపూర్తి సేయించినచోఁ బరిణయం బగుటకు ను, జేయింపం జాలనిచో నీమదనతిని మరలఁ బుట్టినింట విడుచుటకు ను నిర్ణయించి యాకళింగ రాజసూనుఁ డీసతిని గొని చనుచు నిచట మన కప్పగించెను.

ముద్దు—ఇది నిజ మయి యుండు నా?

శంక—సంశయింపం బని లేదు. ఈరాచపట్టి యిట్టిపట్టుఁ బట్టుట వలన నే యాతం డీసుదతి యింతులలో మేలుబంతి యని కొని యాడెను.

ముద్దు—ఈమె వ్రత మెట్టిది?

శంక — ఏకవత్సర దీక్ష గలది. అక్కాలంబున నీ చక్కరబొమ్మ యొక్క తె రెయి యొక్క చక్కనిమందిరంబున నుండి సంతతంబు శ్రీరాధాకాంతు నర్చించు చుండును. ప్రతిదినంబు నెందఱు వచ్చిన ను, విప్రులకుఁ బ్రత్యేకము గా నొకపట్టుచాఁపు ను నూఱురూపాయలతో నొకవెండిచెంబు ను, సువాసినులకుఁ బ్రత్యేకము గా నొనపట్టుకోక యు నొకపట్టురైక యు నాలుగువరాలదక్షిణతో ఫలభరిత మగు నొకవెండిపళ్లెరము నొక వెండికుంకుమబరిణె యు నొకవెండిదువ్వెన యు దానము సేయు చుండును. ఈదానంబుల నొకమాఱు గొనినవారు మరలం గొన రాఁగూడదు. మఱియు నన్నికులములవారికి సతతాన్నదానంబు సేయం బడు చుండుట యే కాక, యెవరు వేని నడిగిన న్వానిని లే దనక వారి కిచ్చు చుండ వలెను. ఈవ్రతసమయమున నీమగువ నూడిగము సేయువారు దక్కఁ దక్కినమగవారు గన రాదు. కావున నీకాంతచెంత దానములను గొనుపురుషులు దమకన్ను లకు బట్టఁ గట్టుకొన వలెను. ఇట్లు వ్రతసమాప్తిం జేయించిన నె యీవరాంగి వరించును.

ముద్దు — మీ తలం పేమి?

శంక — వ్రతమును జేయించుట కె.

ముద్దు — అట్లయిన నీ కున్నధనము చాల దని తలంచెదను.

శంక — చాలనిచో నప్పు సేయుదును. ఓయీ! ఇమ్మందయానం బొంద కున్న నేను బ్రదుకుట నిక్కువము. ధనమును నే నార్జిం

చితి నా? లేక నన్ను ధనమార్జించె నా? నేను బ్రతికి యుండినం గా వలసినంత విత్తమును సంపాదింతును.

ముద్దు—(తనలో) వీనికి వినాశకాలము సమీపించినది. ఇప్పుడు హితోపదేశము సేయం బూనుట బూడిదయందు నేయి వేల్చు ట యె. (ప్రకాశము గా) ఎప్పటినుండి వ్రతము ప్రారంభింపం బడును?

శంక—రేపటినుండి యె. మనపొరుగువీధి నున్నయమ్మిద్దెయం దీచం దనగంధి నుంచెదను. అది యన్నింటి కనుకూల మయినది. నే నీసంవత్సర మీచేడెను జూడం గూడదు. కావున నీ వె యచ్చట నుండి యిమ్మచ్చెకంటియిచ్చకు వచ్చునట్లు దానాదులను జేయించు చుండుము.

ముద్దు—(తనలో) ఇది యితనియోగునకు ను నాభాగునకు ను వచ్చి నది. ఇతఁడు గీ డొందుట నిశ్చయము. నే నేల మే లొంద రాదు? వెలుఁగున్నప్పు డే కదా వెతకుకొన వలెను. కాన దాన ములు నూ అయినచో నూటపది యని యు, నూటపది యయి నచో నూటయిరువది యని యు నిట్లు పెంచి చెప్పుచు నా పెచ్చు దానంబుల నేను స్వీకరించి ధనికుండ నయ్యెదను. ఇట్టివానిధన మును దానము గొన నేను ను బాత్రుఁడ నె.

శంక—ఓయీ! ఏ మ ట్లాలోచించు చున్నవాఁడవు?

ముద్దు—అయ్యా! ఏమి యు లేదు. మీసన్నిధిం బాసి—

శంక—చింతింపకుము. ఈమె నాప్రాణాధికురాలు. నీ వే యీయింతిచెంత నుండ వలెనని నాకోరిక. నీకంటె నమ్మఁదగిన వాఁడు వే ఱొకఁడు లేఁడు.

ముద్దు.—మీసెలవునకు మాఱు పలుకఁ గల నా ?

శంక—ఓయీ ! రమ్ము. మన మిపు డరిగి, రమణీమణిని రహస్యము గా నాక్రొత్తయింటఁ బ్రవేశింపం జేయుదము.

ముద్దు—చిత్తము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.



# చతుర్థాంకము.

## ప్రదేశము—కాననము.

[గోపాలవర్మ నడుచుచుఁ బ్రవేశించును.]

గోపా—(తనలో) గుఱ్ఱమును మేఁతకై విడిచి యిక్కడకు వచ్చితిం గదా. (అటునిటుం గని) ఇది గాదా మేము మొదట నున్న స్థలము? అదిగో సెలయేఱు; అల్లదిగో మఱ్ఱిచెట్టు. ఇది యచ్చో పె. అట్లయినచోఁ బ్రాణేశ్వరి యేది? ఇంక ను స్నానాదికృత్యములం దీర్చుకొన లే దా? ఏ మాశ్చర్యము!! పిలిచి చూచెదం గాక! ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ! ఏల పలుక కున్నది? నాపిలుపు వినిపింప లేదు కాఁ బోలు! బిగ్గర గాఁ బిలిచెద. ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ! అయ్యో! అక్కలుకులాఁడి పలు కదు! ఆబోటిమాటం బాటింపక యామె నొంటి గా నిక్కడ డించి నే నేగుటవలన నాపై నలిగి డాఁగి యున్న దే మో? తరుణులకలుక కారణము లేక యే కలుగు చుండ నించుకకార ణము గలిగినచో నిఁక నుడువు టేల? కావున నామెను వెమ కెదం గాక! (అటు నిటు వెదకుచుం గైతవంబున) ఇదిగో కంటిని. ప్రాణేశ్వరీ! నీవు తమాలతరువులనడుమ డాఁగినను, మించును మించునీమేనిచాయ దాఁగదు సుమ్ము. నెచ్చెలీ! నీ వీపొదరింట నుంట నీముఖచంద్ర మె తెలుపు చుండ నింక

న్వెలుపలకు వెడల వేమి? చాల ప్రొద్దెక్కెను. ఇది పొలయలుక కదను గాదు. కాన నీయలుక మాని యోకులుకు లాఁడీ! ఇటు రమ్ము; నన్ను మన్నింపుము. ఇప్పుడు గదా లభించితివి? ఓకుము దేక్షణా! నీవు లతావ్రాతమధ్యంబున నున్నను, నాకుఁ గానరా కుండు టెట్లు? (విమర్శించి) అయ్యో! నే నెంతవెతకినం గాంతా మణి గాన రాదు; చేలాలంకారాదివస్తుజాలము లేదు; నాగుఱ్ఱము గానిపింపదు! కనుక నిక్కము గా నాకనకాంగి యెక్కడ కయినం జని యుండును. హా! ప్రాణేశ్వరీ! హా! జీవితేశ్వరీ! నన్నుఁ బాసి వెల్లితే? (అని మూర్ఛిల్లి, తెప్పిఱిల్లి) నాప్రాణ ధనమా! నేఁ జేసిన నేర మేమి? నన్నేల విడిచితివి? నిన్నుఁ గనకపురికి వెంటఁ దీసికొని చన నైతినని యా నాయందు నీ వా గ్రోపించినదోషము? ఈపాటి నేరమున కింతటిదండనము దగు నే? వనితారత్నమా! నీవదనసుధాకరబింబముం జూపించి, నాశో కాంధకారంబుం బాపుము. విరిబోఁడీ! నీపరిరంభమున నాపరి తాపముం దీర్పుము! అక్కటా! నే నెంతపాపిని! ఓదైవమా! నా కింతటివంతం గలిగించి తే? కా నిమ్ము. నే నీవన మంత యు వెదకెదం గాక! (అని లేచి కొంచెము నడిచి పికము నుద్దేశించి.)

వసుధావృత్తము. గళనాదమునన్
గలకంఠమ! నిన్
దలకించుసతిన్
దిలకించితి వే?

ఏ మిది? నాపలుకు లాలింపక, కులుకుచుం గూయు చున్నది! కోయిలా! పదరకు; పదరకు. నీపొగరుఁ బాప మొగులు వొడము చున్నది. (ఇంచుక నడిచి శుకమును జూచి.)

మదనవిలసితవృత్తము. మృదువచమున నీ
పద రడఁచెడునా
సుదతి యెచట ను
న్నది? శుకవరమా!

ఓహో! ఇది యు మాఱు పలుక కున్న దే! శేముషీమోషణ బింబభక్షణంబున దీనికి నుచితానుచితంబులు దెలియవు కదా! (మఱి కొంచెము నడిచి యంచం గాంచి)

హంసమాలావృత్తము. గతిచే నీమదంబున్
హతముం జేయుచానన్
శతపత్రాననం జూ
చితి వే? రాజహంసా!

కటకటా! ఇది నామాటం బాటింపక, మృదుబిసఖండంబు నిజాంగన కిచ్చుచు నానందించు చున్నది! ఇజ్జగంబున నొక ప్రాణి దుఃఖించు చుండఁ గా మఱియొకప్రాణి సుఖించు చుండుం గదా. ఛీ! దీనిం జూడఁ గూడదు. (కొన్ని యడుగులు నడిచి ఖంజనంబును గని)

నాగరవృత్తము. కంజదళాయతాక్షులన్
ఖంజనరాజమా! నినున్
భంజన సేయుకామినిన్
మంజులగాత్రిఁ గంటి వే?

ఇస్సీ! ఇప్పు డిప్పిట్టయింత గా మిట్టి పడు చుండుట యాలేమ లే దనుకొని యెకాఁ బోలు! ఇది నాకుం బ్రత్యుత్తరం బిచ్చు నే? (ఇంక నించుక నడిచి యళిని దిలకించి)

తనుమధ్యావృత్తము. తోరం బగువేణీ
భారంబున నిన్నున్
గారించెడురామన్
సారంగమ! కంటే?

అయ్యయ్యో! ఇది నావచనమును వినక యె మకరందరసాస్వాద నాయత్తచిత్తంబుతో నొకకుసుమంబునుండి వే ఱొకకుసుమంబు నకుం బోవు చున్నది! స్వార్థపరులకుఁ బరార్థఘటనాసక్తి శూన్యంబు గా దే? (వనమునఁ బరిభ్రమించుచు.)

సీ. మిముఁ బోలుమృదులాంగి మీరలు గంటిరే?
లావణ్యరాజితలతికలార!
మిముఁ బోలువరకాంతి మీరలు గంటిరే?

సుందరచంపకసుమములార!
మిముఁ బోలునరుణోష్ఠి మీరలు గంటిరే?
మంజుజపాకుసుమంబులార!
మిముఁ బోలుమృదుపాణి మీరలు గంటిరే?
లలితనూతనకిసలయములార!
ముమ్ముఁ బోలునీలాలక మీరు గంటి
రే? రుచిరతమాలాగములార! సరి గ
మిమ్ముఁ బోలుమధురవాణి మీరు గంటి
రే? రసాలఫలవరములార! చెప్పుఁడు.

అకటకటా! ఈవన్యంబులు సైతమామాన్యచొప్పం జెప్ప కున్నవి! నే నేమి చేయుదును? నాయొప్పులకుప్ప నెప్పగిదిఁ గనుంగొందును? ఆచందనగంధి నెట్లు పొందుదును? కట్టా! ఇంక నాకాయాస యేల? హా! జీవేశ్వరీ! నన్ను విడిచితి వే? అయ్యో! నే న ట్లనం జాలను. ఓమానినీమణీ! నీమానసంబు నే నెఱుంగుదును. నీవు నన్నుం బాయుదు వే? ఓరామా రత్నమా! నీవు త్రిలోకసుందరి వగుట న్ని న్నాలోకపాలురలో నొకండు హరించి యుండ నోపు! అట్లు కానిచో నింతలో నాకుం గాన రాక మటుమాయ మగుదు వే! హా! కాంతామతల్లీ! హా! కాంతకల్పవల్లీ! హా! నవతరుణీ! హా! సతీమణీ!

సీ. వెలఁది! నీముఖలక్ష్మి వికచాబ్జమున కిచ్చి,
కన్దోయిసిరి నల్లకలువ కిచ్చి,
భ్రమరకకాంతిని భ్రమరకంబున కిచ్చి,
మోవికావిని బింబమునకు నిచ్చి,
దంతసుందరతఁ గుందవ్రాతమున కిచ్చి,
కౌనుచందంబు సింగమున కిచ్చి,
బాహుశోభను లతావారంబునకు నిచ్చి,
పాదచ్ఛవిని బల్లవమున కిచ్చి,
గమనమంథరతను మత్తకరికి నిచ్చి,
తనువికాసముఁ జంపకమునకు నిచ్చి,
నాతిరో! నీవిరహబాధ నాకు నిచ్చి,
పోయితే? మనోహారిణీ! పుడమి విడిచి.

(అని మూర్ఛిల్లి, తెప్పిఱిలి లేచి) ఆబాల లేకున్న నా కీచేలంబు లేలా? ఆ యోష లేనిచో నా కీభూష లేలా? (అని చేలాలంకారంబులం బార వైచి యేకాంబరుఁ డై) అక్కలకంఠిం బిలుచుచు నెమకెదం గాక!

వసుధావృత్తము. ధృతపూతమతీ!
జితహంసగతీ!

యతిరూపవతీ!
సతి! మానవతీ!

అదిగో! అమ్మగువమొగము! (అని పరుగెత్తి చూచి) ఇస్సీ! ఇది వికసితబిసరుహము. అదె, యన్నులమిన్న నన్నుం జూచుచున్నది! (అని పరుగెత్తి చూచి) ఆనందరాంగిచూపు గాదు. అది హరిణకిశోరము; నాచరణధ్వని విని బిఱబిఱం బఱచెఁనిని. అల్లదిగో! అబ్బాలామణి నన్నుం దన కేలం బిలుచు చున్నది! (అని పరుగెత్తి చూచి) కటకటా! ఇది కరము గాదు; కుసుమితనవమాలికాలతికాగ్రము. ఇదిగో! కనకాంగికచభారము! (అని పరుగెత్తి చూచి) కాదు. కాదు. ఇది బర్హిబర్హము. ("ధృతపూతమతీ" యనుపద్యముం జదువుచు నలుదిక్కులకుం బరుగెత్తుచు నేగును.)

---

ప్రదేశము—కనకపురిమార్గము.

[మహాదేవయ్య నడుచుచుఁ బ్రవేశించును.]

మహా—(తనలో) ఇప్పురి నున్నశంకరగుప్తునిభార్య సేయు చున్న దానంబులు జగద్విశ్రుతంబు లగుట విని, నాకు నొకదానంబు లభించు ననునాసచేత నిటకు వచ్చితిని. ఇది యే కాఁ బోలు శంక గుప్తునిమందిరంబునకు మార్గంబు? (ముందుంజూచి)

ఎవఁ డో పరుగున నిటు వచ్చు చున్నవాఁడు! వాని నడిగి తెలిసి కొందును గాక!

గోపా—("ధృతపూతమతీ" యనుపద్యముం బఠించుచుఁ బరుగున వచ్చి మహాదేవయ్యను గాఁగిలించును.)

మహా—(తనలో) అబ్బా! వీఁ డెవ్వఁడు? నన్నుఁ గట్టి గాఁ గౌఁగిలించెను! (అని యల్లన విడిపించుకొని, ప్రకాశము గా) నీ వెవ డవు?

గోపా—ధృతపూతమతీ!

మహా—నీ పే రేది?

గోపా—జితహంసగతీ!

మహా—నీ వేల పరుగెత్తుచు వచ్చితివి?

గోపా—అతిరూపవతీ!

మహా—న న్నేల కౌఁగలించితివి?

గోపా—సతి! మానవతీ!

మహా—(తనలో) వీఁడు నిస్సందేహము గాఁ బిచ్చివాఁడు. వీని మోమున కింత బూదిఁ బూసి, మేనిమీఁద నొక గుడ్డ వేసి, వీనిని వెంటం గొని పోదు నేని నాకొక దానంబు ను వీని కొక దానంబు ను దొఱుకును. పిమ్మట వీనికి దొఱికినదానిని సైతము నే నే స్వీకరింతును. ఇట్లు నాకు దానద్వయం బబ్బును. కనుక వీనిని వెంటం గొని చనుటయె లెస్స.

(అని గోపాలవర్మకరముం బట్టి లాగుచు నిష్క్రమించును.)

---

ప్రదేశము—మానవతీమందిరద్వారము.

[ముద్దుసామి యటు నిటు దిరుగుచు బ్రవేశించును.]

ముద్దు—(తనలో) ఆహా! మోహము మిగుల హానిదము కదా!

ఉ. మోహము పాపకారకము,
మోహము బుద్ధిలతాలవిత్రమున్,
మోహముబంధదాయకము,
మోహముమాయకుమాతృవాసమున్,
మోహ మనర్థకంబులకు మూలము,
మోహము దుఃఖధామమున్,
మోహముఁ జెందుమానవులు
మూర్ఖులు గా రె? తలంప నిద్ధరన్.

ఈ మోహనాంగి మోహసాగరంబున మునింగి యున్న నాయొడ యుం డెంత జడుండు! ఇవ్వగలాఁడిని వలచి యింట నిలిచి యుండినసా మ్మంత యు వ మ్మైనర్చి యప్పుల పాలయ్యెను. కట్టా! బంధకంబు గాని స్థిరసంపత్తి యతనికి లేదు. పూర్వప్రసిద్ధి నింక నప్పు మాత్ర మత్యంతప్రయత్నమున నెట్లో యబ్బు చున్నది. అన్న న్నా! ఈసుందరిని బొందుట స్వర్గసుఖమును బొందు టని యామందుని డెందంబున నున్నది కాఁ బోలు! రామ! రామ! అజ్ఞానహీనుఁడు తన్వితత్వంబు నిప్పటికిం దెలిసికొన కున్న వాఁడు!

గీ. ఆరయ శిరావసారక్తపూరితంబు,
మాంసభరితంబు, మలమూత్రమందిరంబు,
గాదె నారులదేహంబు? మీఁదితోలుఁ
గనినమాత్రమున న్నరు లొక్కనుట దగునె?

ఛీ! తోలుం గాంచి చాల మోహించి మే లగుతనబ్రతుకును లీల కై నేలపాలు గావించుకొనినయాబేలకొఱ కింత గాఁ జింతించు టేల? అతని కట్టిబుద్ధి పుట్టుకున్నచో నాకుం బెల్లు గాడ బ్బబ్బు టెట్టూ? పుడమి నొకఁడు సెడినం గాని యిం కొకఁడు పెంపుఁ జెందఁడు కదా. కావున నాతని లేమిం జూచి వంతఁ బొందుటకంటె నాకలిమిం జూచుకొని సంతస మొందుట యె యుక్తము. నేఁ డే లొకో యింక ను బ్రాహ్మణులు రా కున్నవారు? (ముందుం జూచి) అదిగో! యిద్దఱు పాఱు లిటు వచ్చు చున్నవారు!

[అంత మహాదేవయ్యయు ను గోపాలవర్మయు ను బ్రవేశింతురు.]

మహా—(ముద్దుసామి నుద్దేశించి) అయ్యా! ఇదే కదా శంకర గుప్తుఁడుగారిభవనము?

ముద్దు—ఔ నిదే.

మహా—ఆమహారాజు, శంకరగుప్తుడుగారికీర్తి జగద్విఖ్యాత మయి నది.

ముద్దు—ఇప్పు డే మయినది? ఇఁక ముం దున్నది. అయ్యా! మీది యేయూరు?

మహా—మాది రామేశ్వరము.

ముద్దు—మీ పేరు?

మహా—మహాదేవయ్య యందురు.

ముద్దు—ఆతని పేరు?

మహా—అతని పే రా? అతని పే రా? సుందరయ్య.

గోపా—("ధృతపూతమతీ" యనుపద్యమును గొణఁగుచు జదువు చుండును.)

ముద్దు—అతం డేమి గొణంగు చున్నవాఁడు?

మహా—అతఁ డా? అతఁ డా? కవీశ్వరుఁడు. సదాకవిత—

ముద్దు—మీరు దానములం గొన నిచ్చోటునకు వచ్చితి రా?

మహా—ఔను. దానముల కొఱ కే.

ముద్దు—మీరలు దాత్రిని జూడఁ గూడదు. కాన దానములను గొనునప్పుడు మీరు మీకన్నులకు బట్టలఁ గట్టించుకొన వలసి యుండును.

మహా—అ ట్లే చేయ వచ్చును. నాకు వేద మంత్ర యు వచ్చును. కావున సంకల్పాదులను నేఁ జెప్పెదను.

ముద్దు—ఆయమకు నిజ మనస్సంకల్పము దప్ప, మీసంకల్పాదులు పనికి రావు.

మహా—ఓహో! ఏమి సాత్వికదానము! ఏమి సాత్వికదానము!!

ముద్దు—రండు. మనము లోనికి వెళ్లుదము. (అని వా రిద్దఱిని లోనికిం గొని చని నోటుం జూపించి) మీర లిచ్చట గూర్చుండుఁడు. ఆమె యిక్కడ కె వచ్చును.

మహా—అ ట్లగుం గాక! (అని కూర్చుండి, గోపాలవర్మను గూర్చుండం జేయును.)

[అంత మానవతి దూరమునఁ బ్రవేశించును.]

మాన—(ముందుఁ గని యచ్చెరువుతోఁ దనలో) ఏ మిది? స్వప్న మా? సత్య మా? నేఁ బండుకొని యున్న దాన నా? అతఁడు ప్రాణేశ్వరుఁ డా? కాఁ డా? (ఇంచుక యాలోచించి) ఇది సత్య మె. నేను మేల్కొని యే యున్న దానను. అతఁడు ప్రాణేశ్వరుఁ డె. వెంట నున్న యాతుంటరిబాఁపఁడు దానద్వయంబుఁ జేకొన నెంచి, మద్విరహంబున మతి చెడియున్న ప్రాణేశ్వరు నిచ్చోటునకుఁ దెచ్చెను. ఆహా! విరహవేదన మత్కాంతు నెంత గా మార్చెను! పోల్చుట నాకు సైతము కష్టసాధ్య మయ్యెను! కటకటా!

సీ. శారదరాకానిశాచంద్రుఁ డగుమోము
    ప్రాతస్సమయశశిభాతి నొందె,
నవవికచాబ్జసుందరనేత్రయుగళంబు
    సాయంసరోరుహచ్ఛవిని బూనె,
భగ్నవిహీనబింబముదూఱునధరంబు

సభసితబింబంబుసారుఁ గాంచెఁ,
బదియునాఱవవన్నె పసిఁడిమిసిమిచాయ
పదవవన్నియపైఁడి పగిది నొప్పెఁ,
జారువసనరాజితసుకుమారతనువు
మలినచేలంబులను దాల్ప వలసె నకట!
యిట్టిదురవస్థలను గనినట్టినేను
సుఖము గా మని యుండుట చోద్యము గద!

ఓహృదయమా! నీవు వ్రక్కలు గా వేమి? తుచ్ఛప్రాణమా! నీవు దొలంగ వేమి? హా! దైవమా! ఎంతవాని నెంతవానిఁగాఁ జేసితివి! నీయెడ మే మేమి తప్పుఁ జేసితిమి?

4 *

అక్కటా! ఇచ్చెరనుండి యెట్లు తప్పించుకొందును? నాప్రాణనాథు నెట్లు కలసికొందును? ఈతఁడు నాజీవేశుఁ డని యాపాపాత్మున కించుక తెలిసినచో, నీతని నేమి చేయించు నో? నాకెట్టియిక్కట్టులు గలిగించు నో? దుర్మార్గులకుధనముండిన దుండగములకు లో టా? కనుక నాయుల్లములోనితలంపు నిప్పుడు వెల్లడి సేయ రాదు. ఇఁకఁ గర్తవ్య మెద్ది? (ఇంచుక యాలోచించి) సరి. ఇట్లు చేయుదును:—"మీరు నేఁటినడురేయి యిమ్మేడకడకు వచ్చినచో, మనము గలసి వెడలుదము." అని యొకచీటి వ్రాసి ప్రాణేశున కిచ్చుచెంబులో నుంచెదను. ఈ

రాత్రి యెవ్వరికిం దెలియ కుండ నేను బయలు వెడలుట యె
ట్లెస్స. చీటిని వ్రాసి తెత్తును గాక? (అని నిష్క్రమించును.)

ముద్దు—అయ్యలారా! ఆయన వచ్చువేళ యయినది. ఇఁక మీ
కన్నులకు మీబట్టలను నేనుగట్టెదను. (అని యట్లు చేయును.)

[ తెరలో ] - ముద్దుసామీ! బ్రాహ్మణు లున్నవార లా?
దానద్రవ్యములు సిద్ధము గా నుంచితి వా?

ముద్దు—సర్వము సిద్ధము.

మాన—[ప్రవేశించి వెండిచెంబు ను బట్టల ను గొని గోపాలవర్మ
చేతులలో నుంచి] ముద్దుసామీ! ముందు గా నితని నవతలకుం
బంపించివేయుము.

మహా—ఇది కేవల మన్యాయము! అన్యాయము! నేను స్వాధ్యా
యవిశిష్టుఁడను. కాఁబట్టి మొదటిదానము నాది. ఇం తే కాక,
మే మిద్దఱము ను గలసి వచ్చితిమి. కనుకఁ గలసి వెళ్లెదు ము.

ముద్దు—మా టాడఁ గూడదు. (అని గోపాలవర్మకరముం బట్టుకొని
యతనిని గొని చని వెలుపల విడిచి వచ్చును.)

(మానవతి మహాదేవయ్యకు దాన మిచ్చును.
అందఱు నిష్క్రమింతురు.)

ప్రదేశము—రాజమార్గము.

[మహాదేవయ్య ప్రవేశించును.]

మహా—(తనలో) ఆ! ఏ మిది? ఏ మిది? ఆ వెఱ్ఱిముండకొడుకు వడి వడి నడుచుచుంబట్టుబట్టలను విసరి వేసెను! చెంబులోనుండి రూపాయలను దీయుచు విరియఁ జల్లుచున్న వాఁడు! హా! ఎందఱు జనులు వానివెంట నంటి యున్న వారలు! అయ్యో! నామనో రథము వ్యర్థ మయ్యెను. నా కాదానము దక్కక పోయెను. అది లోకులపా లయ్యెను. పరిశ్రమపరితాపములు మాత్రము నాకు లభించెను. ఎంతదుఃఖకరము! ఎంతచింతాకరము!! ఇప్పుడె నేఁ బరుగున నేగి వానిచేత నున్న వెండిచెంబు నయిన నుబెఱుకుకొందును గాక! కాలినయింటినుండి యొకకంప దక్కిన ను లాభ మే కదా. (అని పరుగెత్తుచు నిష్క్రమించును.)

[అంతఁ గ్రిందుఁ జూచుచు నడుచుచు గౌరీపతి ప్రవేశించును.]

గౌరీ—(తనలో) ఎవఁడో యామహారాజు? రూపాయలను నడు వీథిలోఁ గురిపించెను! కొందఱికి మూఁడేసి కొందఱికి నాలుగేసి రూపాయలు దొరకెను! నా కొక్కటియుఁ జిక్కక పోయెను! వెతకుని కట్టె నాకు దక్కెను! అక్కటా! నావిధి నే మందును? ఇదిగో! ఇచట నొకచీటి పడి యున్నది. ఇ దే మో? దీనిని విచ్చి చూచెదను. (అని యట్లు చేయుచు) నేను బాగు

గాఁ జదువుకొన లేదు. అక్కరములు చిక్కి మిక్కిలిచిన్నవి గా నున్నవి. అట్లయినం జదువఁ గడంగుదును. మీ—రు—నే—టి—న—డు—రే; ఓహో! ఇది యాకుగుడి, యి; మీరు నేటి నడురేయి; సరి. పిమ్మట? యి— మాకు మావ డిచ్చిన ఇమ్మ, యిమ్మా కేత్వమిచ్చిన ఇమ్మే; యిమ్మే—డ; యిమ్మేడ. అనఁ గా నేమి? అది వ్రాత తప్పు. యీమేడ. సరి. తరువాత క—డ—కు—వ, చాకింద చా వ్రాసిన ఇచ్చ; ఇచ్చాకు గుడి యిచ్చిన ఇచ్చి. వచ్చి—న—చో—మ—న—ము—గ—ల—సి—వె—డ—లు—ద—ము. కడకు చచ్చినచో మనము గలసి వెడలుదము. ఈమేడ యన నేది? (అటు నిటుఁ జూచి) ఈవీథిలో శంకరగుప్తుని మేడ తప్ప మఱేది యు ను లేదు. కావున శంకరగుప్తునిభార్య యె యీచీటి నెవని కో వ్రాసి యుండును. ఇది వానికంద లేదు. అంది యుండిన నిట్లు వీథిలోఁ బడి యుండు నా? నా కాగరిత దొరకుట కే కాఁ బోలు నా కిది చిక్కెను. కాఁ బట్టి యీరాతిరి యక్కడఁ గాచియుండి, యాపడఁతి పయన మయినచో నగలతో దానినంకించుకొని యెక్కడ కయిన నేగి సుఖము గా బ్రతుకుదును. అది బయలు వెడల కున్నచో రాతిరి వేచుకష్టము మాత్రము నాకుఁ గొంచెము గలుగును. దానిని రూపాయలను వెదకిన కష్టముతోఁ గలుప వచ్చును. నాపున్నె మెట్లున్న నట్లగును. కాచుట మాత్రము మానను.

(అని నిష్క్రమించును.)

ప్రదేశము—అరణ్యము.

[మానవతి యు గౌరీపతి యుఁ బ్రవేశింతురు.]

మాన—ఓయీ! నీ వెవ్వఁడవు?

గౌరీ—కనకపురినివాసుఁడను; జంగముకొలమునఁ బుట్టినవాఁడను; నేను బట్టలు కుట్టుపని సేయుచుందును; నాపేరు గౌరీపతి.

మాన—నన్ను నీమూఁపున మోసి యిక్కడ కేల తెచ్చితివి?

గౌరీ—నిన్న మీగుమ్మముముందఱ నొకచీటి నాకు దొరకెను. దానిని జదువుకొని నీయందలియాసచేతఁ గడచినరేయి మీ మేడకడ నేను గాచి యుండఁ గా నా పున్నెమువలనఁ దోలు నిచ్చెన తెన్నున దిగు చున్న నిన్నుం గని రయంబున నామూఁపున నెక్కించుకొని యీయడవికిం దెచ్చి యిచ్చట దించితిని. ఇప్పుడు తెల్లవారెను. కనుక నిఁక నడువుము. ఏదేని యొక పల్లెం జేరి యందు వండుకొందము.

మాన—(తనలో) ప్రాణేశ్వరుండు నాచీటిని జదువుకొనక యె పాఱ వైచి యుండును. అది యీటక్కరికానికిం జిక్కి యింత యయ్యె. హా! దైవమా! ఎంతపనిఁ జేసితివి! పెనమునుండి పొయ్యిలోనికి గెంటితివి! నిన్నే మన వచ్చు? (ప్రకాశముగా) ఓయీ! పరునిసతిని గొని రా వచ్చునా?

గౌరీ—నీవు పరునిసతివి గాఁ దలంచుటవలన నె నాపాలఁ బడితివి! సెట్టిని వంచించిన నీకు వంచన గలుగుట మంచిపని యే కదా.

మాన—(తనలో) ఇప్పాపాత్మునితో వాదం బేలా? వీఁ డనినట్లు వంచనకు వంచనయే మంచిది. (ప్రకాశము గా) ఓయీ! ఇఁక నే నెంత చింతించిన, నొరుల నిందించిన, నేమి లాభము? కర్మానురూపఫలము ననుభవింపవలసిన దె. నేఁ గోరినపురుషుఁడు దొరక లే దనువంత నా కావంత లేదు. నీవు సెప్పినట్లొకపల్లెను జేరుకొందము. కాని, డప్పివలన నిప్పుడు నానాలుక తడఁ బడు చున్నది. నేఁ గడు బడలితిని. ఇఁక నడుగుఁ దీసి యడుగు నిడఁ జాలను. కాన నీ వీచెంబును గొని చని చల్లని జలమ్ముఁ దెమ్ము. రయమ్మునఁ బొమ్ము. (అని చెంబు నిచ్చును.)

గాడీ—(చెంబు నందుకొని, తనలో) దీని నిఁక మోయఁ జాలను. నీరు దెచ్చి యిచ్చి దీనిని దోడ్చుకొని వెళ్లెదను. అంతదాఁక నిది యిచ్చట నుండ వచ్చును. ఇంతలో నే మగును? (ప్రకాశము గా) మగువా! దిగు లొందక నీ విక్కడ నె కూర్చుండి యుండుము. ఇప్పు డె నీరుఁ దెత్తును. (అని నిష్క్రమించును.)

మాన—(తనలో) ఇప్పాపి నిప్పటి కెట్లో తప్పించుకొంటిని. వాఁడు మఱలి వచ్చునంతలో నే నిచ్చోటునుండి యెచ్చోటున కేని వెళ్లవలెను. ఎటు వెళ్లుదును?

5 *

(నలుదిక్కులు గని) ఎవరో యిద్ద ఱిటు వచ్చు చున్నవారు? వారు నన్నుఁ గాపాడఁ గల రే మో? (అని యోచించు చుండును.)

[అంత భీమన్న యు సోమన్న యుఁ బ్రవేశింతురు.]

భీమ—

ఉత్సాహము.

దొంగతనము సేయునరుఁడు దొడ్డవాఁడు ధారుణిన్
బంగరు సుకరముగఁ దాను బడయుఁ దనివి దీఱఁగన్
సంగరంబు లేక పొంచి జనులయుసురుఁ దీయుచున్
బొంగి మేటిజోదు నంచుఁ బూను గర్వము న్మదిన్.

చేసిన, దొంగపని నే చేయ వలెను; గడించిన, డబ్బు నే గడింప వలెను.

సోమ—ఔను. కాని, దొంగతికము సేయుట దుష్కరము.

పంక్తివృత్తము.

చౌర్యముఁ జక్క గ నల్పఁగఁ జా
తుర్యగురుత్వముఁ ద్రోప వలెన్,
శౌర్యము వానిరి సాఁక నగున్,
ధైర్యము నెమ్మదిఁ దాల్పఁ దగున్.

ఒనరించి, గడించి, యఱిగించుకొన్నచో, దొంగతనముకంటె దొడ్డవృత్తి మఱి లేదు. అట్లు కానిచో, దానివలన మానప్రాణ హాని గలుగక మానదు.

భీమ—ఓరి, వెఱ్ఱితమ్ముఁడా! నేర్పునఁ జౌర్యముం జేయ నేరని వాఁడు చోరుఁ డే కాఁడు. అట్టినరుఁడు దనపొట్టకక్కుఱితి కొలకావృత్తిని బూనువాఁడు.

సోమ—అన్నా! కను. కను. ఘన మగునాచెట్లచాటున నిలచి యున్నయవ్వనిత వనదేవత వలెఁ గనఁ బడు చున్నది!

భీమ—(చూచి) ఔను. ఆయమ్మ విశేషమ్ము గ సొమ్ములం దాల్చి యివ్వనమ్మున నొంటి గా నుండు టే లొకో?

6 *

సోమ—ఆమె యే దేని గొప్పయాపద నొంది యుండును.

భీమ—అట్లయినచో, మన మేగి యాయింతిపంతం దీర్చుదము. ఆపన్నారన మందటికిం గర్తవ్యము. (అని మానవతిని సమీపింతురు.)

మాన—(చూచి) ఓయన్నలారా! మీర లెవ్వరు?

భీమ—మే మన్నదమ్ములము; దొంగలము. నా పేరు భీమన్న; వీని పేరు సోమన్న. అమ్మా! నీ వెవతెవు? ఇక్కాఅడవి నొంటి గా నుండఁ గారణ మేమి?

మాన—(భీతిల్లి, తనలో) హా! దైవమా! న న్నిప్పుడు దొంగల కప్పగించితి వా? ఇక్కడ నాకు ది క్కెవ్వరు? ఇఁక మరణ మే శరణము. (ప్రకాశముగా) అన్నలారా! నే నొకరాచ చానను; దిక్కుమాలినదానను. మీకుఁ జిక్కి—

భీమ—అమ్మా! జడియకు. నీకు మే మెట్టికీడుం జేయము. నిన్నుఁ జూడం జూడ మాకు జాలి వొడము చున్నది.

సోమ—అమ్మా! మేము దొంగల మే యయిన ను, మామాటలను నమ్ముము. అ దేలొకో నిన్నుఁ గన్నతోడ నే నీయందు మాకు గౌరవబుద్ధి గలిగెను! మాచేత నైనంత సాయముం జేసి, నీవంతఁ దీర్తుము.

మాన—(తనలో) వీరలు దొంగలయిన ను మంచివారలు. వీరిం జేరి యిప్పటి కాజంగమువానిబారిం దప్పించుకొందుం గాక! పిదప సర్వేశసంకల్పానుసార మగును. నా కిప్పుడు దొంగ యింట మంచము వేయ వలసి వచ్చెను. (ప్రకాశము గా) అన్న లారా! మీ యి ల్లిక్కడ కెంతదూరము?

భీమ—మిక్కిలిసమీపము.

మాన—మీయింట నున్న వా రెవరు?

భీమ—మే మిద్దఱము తక్క మ ఱెవ్వరు ను లేరు.

మాన—వంట?

భీమ—మే మే వండుకొందుము.

మాన—నన్ను మీయింటికిం గొనిపోయెద రా? మీకు వండి యిచ్చు చుం డెదను.

భీమ—అంతకం టె మాకుఁ గావలసిన దే మున్నది? అమ్మా! నడువుము.

సోమ—నిన్ను మాకన్నతల్లిం బలెఁ జూచుకొందుము. అమ్మా! సందియ మొందకుము.

మాన—అన్నలారా! మీరు బాగు గా దొంగతనముం జేయఁ గల రా?

భీమ—అమ్మా! మమ్ము మించినదొంగ లిద్దేశంబున లేరు.

సోమ—మమ్ము మేము పొగడుకొన రాదు. నిజము గా మేము దొంగలరాయలము!

మాన—కనకపురిశంకరగుప్తు నెఱుంగుదు రా?

భీమ—లెస్స గా నెఱుఁగుదుము. వాఁ డొకమానినిం దెచ్చి, దానిని వేఱు గా నొక మేడయం దుంచి, దానిచేత దానము లిప్పించు చుండును.

మాన—ఔను. ఆచేడె యున్న మేడపడమటిగదిలో రెండుచిన్న పెట్టెలు మాత్రము గలవు. దొడ్డిలో నొకగుఱ్ఱము గట్టం బడి యున్నది. వానిని దెచ్చి నా కొసంగఁ గల రా?

భీమ—అమ్మా! ఇ దెంతపని? తప్పక యీరాత్రి యే వానిని దెచ్చి నీ కిచ్చెదము.

మాన—ఇఁక మీయింటికి దారిఁ జూపుఁడు.

సోమ—అమ్మా! ఇటు. ఇటు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—చోరపురపురోభాగము.

[మానవతి ప్రవేశించును.]

మాన—(తనలో) ఇపుడు భీమన్న యు సోమన్న యు నింట లేరు. కావున నీ స్థలము విడిచి పయనము సేయ నా కిది యె మంచి

సమయము. ఎక్కడ శేగుదును? పుట్టినింటికిఁ బోయినచో మగని దిగనాడి వచ్చె నని మనుజు లనక మానరు. నింద నొందుట కంటె మ్రందుట యె మంచిది. నాపతిని వెతక మఱలఁ గనక పురి కరిగినచో ననార్యుం డగునాయర్యుం డెటింగినం దప్పక నన్ను హింసించును. మ ఱెచ్చోటునకుం జనం జను? (ఆలోచించి) నానాథునిహాయసహాయమునఁ గళింగ దేశమున కే వెళ్లెదను. అక్కడ నామామగారి నాశ్రయించి వారిదయను సంపాదించి నారమణుని రప్పించునుపాయ మాలోచించెదను. నేను నిజరూపంబుతోఁ బ్రయాణంబు సేయు చున్న నాపదల కాఁపుండదు. కాన నామగనిదుస్తులతో మగవేసము వేసికొందును గాక! నావాంఛలం దీర్పఁ గ వాంఛితార్థప్రదుం డగు నాశిఖిపింఛధరుం బ్రార్థించి నిర్గమించుట లెస్స. (ముకుళితహస్తనేత్రాంబుజ యై)

గోమూత్రికాబంధము.

గీ. శ్రీశ, తనుజితస్మర, గోపవేశ, భార
తీశవినుతితతిరతా, పరేశ, తార
హారధర, కరధృతదర, సూరిపాల,
ఘోరమురహార, నతహార, వైరికాల!

పుష్పమాలికాబంధము.

క. సురపరహార, మావర, హార
శర, మందరధీర, సరసిజనయన, వినతా

మరవరవరదా, ధరధర,

నరబాంధవ, భావభవజనక, సకలకరా!

దండకము. శ్రీరాధికాలోల, కంసాసురాభీల, సచ్ఛీల, సంసారసాలాలవాలా, మునివ్రాతపాలా, సురారాతికాలా, కృతాశ్చర్యలీలా, వ్రజాధీశబాలా, ధృతామూల్యనానామణీజాల, హారిద్రచేలా, మహాపాపకాంతారదావానలజ్వాల, గోపాల! కాలాబ్దనీలాంగ, సౌందర్యదూరీకృతానంగ, కాళీయదుర్గర్వభంగా, వ్రజస్త్రీముఖాంభోజభాస్వత్పతంగా, కృపాపూర్ణదివ్యాంతరంగా! నిను న్నమ్మితిం గాననాయాపద ల్దీర్చి దుష్కీర్తిఁబోకార్చి నన్నేలు మోయా పదుద్ధార, దాసాళిమందార, వారాశిగంభీర, హేమాద్రిధీరా! సదా నాదుచిత్తంబు ధర్మంబునందు న్భవత్పాదనీరేజమందుం దిరం బౌచు నుండం బ్రసాదించి, కష్టంబు లోర్వంగ ధైర్యంబు, దీనార్తిఁబోఁగొట్ట శౌర్యంబు, సత్కర్మము న్నిత్యముం జేయ దార్ఢ్యంబు నా కిచ్చి నన్గావు మోద్రౌపదీ

మానరత్నా, రమాకౌస్తుభస్థానవత్నా, సురత్రాణ
దీక్షా! నతోమాధవా, మాధవా, కేశవా, దేవ
దేవా! స్మరింతు న్నుతింతు న్భజింతు న్నినున్.

7 *

(అని నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



# పంచమాంకము.

## ప్రదేశము—అరణ్యము.

[గౌరీపతి ప్రవేశించును.]

గౌరీ—(తనలో) ఏమిది? నే నీకాంతార మంతయు నెంత వెతకిన నాయింతిపుంతయినుమంతయుం గానరాదు! నాకన్నులలో మన్ను వోసి యాటక్కులాడి నిక్కముగా నెక్కడకో గ్రక్కునం బాఱి పోయెను. (మూంపుం దడవుకొనుచు, మానవతి నుద్దేశించి) ఓసీ, ముండా! రేయంతయు నిన్ను మోయుట నింక న్నామూంపు తీపు దీయ లేదు. ఇంతలో నె నన్ను విడనాడితి వే? అయ్యయ్యో! నీ బూటకపుమాటలు నమ్మి నీటికై పోయి మోస మొందితిని! ఓసి, తొత్తా! అప్పు డె తప్పించుకొంటి నని యుప్పొంగకుము. నీపసిం బట్టి నిన్నుం గలసికొని, నాకసిం దీర్చుకొందును. తాళుము. తాళుము. అక్కటా! నే నిప్పు డెక్కడ కేగుదును? కనకపురికిం జనిన నా సెట్టి నన్ను మన్నింపక చంపును. శివశివా! "ఉభయభ్రష్టత్వ ముపరి సన్యాసిత్వ" మనినట్లు నాబ్రతు కయ్యెను. కట్టా! ఇక నాకేది దారి? (ఇంచుక యాలోచించి) "దేశాల్త్రిమ్మరివిక" మ్మని నానొసట వ్రాయం బడి యున్నది కాం బోలు! అ దే యిప్పుడు

ప్రే  సెను. ఈచెంబు నాచేత నున్నవో దొంగ యని స
రాజభటులు బాధింతురు. కాన నిది నా కేలా?

(అని చెంబును బాఱ వైచి నిష్క్రమించును.)

---

ప్రదేశము—శంకరగుప్తునిగృహము.

[శంకరగుప్తుఁడు ప్రవేశించును.]

శంక—(తనలో) అన్నన్నా! మొన్న రేయి యెక్కడకో పాఱి
పోయినయాయన్నుల మిన్నను నిన్న నెంతవెతకించినను గానరా
దయ్యెను. అది యట్లుండఁగా నిన్న రాతిరినుండి యూపె
పెట్టెలును గుఱ్ఱమును గానరావఁట! ఇదెంతవింత! నా
కెంతవంత! హా! నే నెంతగా వంచింపంబడితిని! కటకటా!

క. ధనమా పోయెను, నేఁ గో
రినరామారత్నమా యదృశ్యంబయ్యెన్,
దినదినము నుత్తమర్ణుల
పెనురాపా హెచ్చె, నాకు వెర వెద్ది యిఁకన్?

ఇంతే కాక, పెండ్లామా పెడమొగము సేయును. సుతులా
నన్నుఁ జూడరు. బందుగులా పలుకరు. స్నేహితులా -
రారు. కట్టా! లేమి ననవలెం గాక, వారల నిందింప నేల?
అయ్యో!

హితము నైఁ బాయనిశో

ణిత మే సంపద్విహీనుని విడుచు చుండన్

సతులు ను సుతులు ను బాంధవ

వితతియు హితతతి యు నతని విడుచుట యరుదే?

పోనీ. వారలతో నా కేమని యింట నుంట కేని వలను పడదు. నేఁడో రేపో యిల్లు వెళ్ళఁబడును; నాకుఁ గారామందిర మబ్బును. కాన నిపు డేమి చేయందగు? ఇఁకఁ జేయ నే మున్నది? మరణమె మంగళము. గరళమో లేక జలమో నాకు శరణము. (మానవతి నుద్దేశించి) హా! పాపాత్మురాలా! నన్నింతకుఁ దెచ్చితి వే? నన్నెంత గావచించితి వే! కటకటా! నీకపటవచనములను నమ్ముట వలన నాయిల్లు గుల్లయ్యె! నాయుల్లము తల్లడిల్లె! నిందఁ బొంది నాబొంది పోనున్నది! ఓసీ, ఘాతకురాలా! నిన్నన నే మున్నది? తప్పు నాది. నిన్ను బలిమిసేయక కలిమిచే మత్తుఁడ నై, నీచెలిమిఁ గోరుటవలన నింత గలిగెను. ఇప్పుడు నిన్నుఁ దెగడిన ను నేను వగచిన ను బ్రయోజనము లేదు. "చేతులు గాలినపిమ్మట నాకుల కై దేవులాడుట"! కన నీజగమున మనుజునకుఁ దన ప్రాణముకంటెఁ బ్రియతర మయినది వే ఱొద్ది యు లేదు. 'ఘ్నన నె లోకోక్తి "బలునుకూరఁ దినుచు నైన బ్రతుకవలె" నని. అట్టినాయునురు నెట్లు పోఁ గొట్టుకొందును? అబ్బా! నే నంతసాహసకృత్యముం జేయ నోపను. మాఱువేసమున నే నితర

దేశములం దిరుగుచుఁ దిరిప మెత్తుకొనుచు జీవింతును. ఇదె, నాపయనమునకుం దగినతఱి.

(అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—కాంతారము.

[ఒకదిక్కునుండి భీమన్నయు మఱియొక దిక్కునుండి సోమన్నయుఁ బ్రవేశింతురు.]

భీమ—తమ్ముఁడా! నే నెంత వెదకిన నాయమ్మ గనంబడ లేదు.

సోమ—అన్నా! నా కాతల్లి వెళ్లినతెరు వయినం దెలిసినది కాదు.

భీమ—తమ్ముఁడా! ఆమె మనలను వంచించి పోవుట కె చుమీ సెట్టియింటినుండి తనపెట్టెలను గుఱ్ఱమును దెప్పించుకొనుట!

సోమ—కా కేమీ? ఆమె కొన్నినాళ్లు మనయింట నుంట పసము దప్పెయొ. ఇపుడు తనదారిఁ దాఁ బట్టినది.

8 *

భీమ—(వంతతో) తమ్ముఁడా! కన్నతల్లికంటె నెక్కువగా మనల నాయమ్మ గాపాడుచుండెను. నిజముగా నిప్పుడు మనము తల్లి లేనిబిడ్డల మయితిమి!

సోమ—అన్నా! ఆయమ్మ వింతవింతకూరల నెంతరుచిగా వండి మన కిచ్చుచుండెను! ఇప్పటికి నారుచి నానోటినుండి పోకున్నది. మన కట్టివంటకము లేక నబ్బవు.

భీమ—తమ్ముఁడా! నిజముఁ బలికితివి. అనుభవింపం జాల కున్న నాపదలకుం గాఁపురమయినదొంగతనమువలన నేమి లాభము? ఎంత విత్త మున్న నేమి ఫలము?

సోమ—నామతము ను "సుఖము లే కున్న సొ త్తేల?" యని యె.

భీమ—అ ట్లయినచో, రమ్ము. మన మిపు డే బయలు వెడలి, సకల దేశములు దిరిగి యాయమ్మను గనుంగొని పాదములపైఁ బడి కడు వేఁడుకొని యాబిడను దోడి తె త్తము

సోమ—ఆతల్లి రా కున్న?

భీమ—ఆమెను గొల్చుచు నచ్చట నుందము. మన మాయమకడ నిరపరాధులము. కాన మనల నామె నిరాకరింపదు.

సోమ—ముందు మన కున్న సొత్తు నొకచోటఁ బాఁతిపెట్టి, వెనుక నెడలుదము.

భీమ—అ ట్లే చేయుదము. రమ్ము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—కళింగరాజభవనము.

[మాధవవర్మమహారాజు ను గుణనిధిమంత్రి యుఁ గూర్చుండి ప్రవేశింతురు.]

మాధ—(చింతతో) మంత్రీ! చిరంజీవి క్షేమసమాచార మే మయినం దెలిసె నా?

గుణ—మహారాజా! ఇంక నేమి యుం దెలియ లేదు. చారులం బంపించితిని. వార లింక—

మాధ—ఇంతకాలపర్యంతము నతనియుదంతము దెలియ కుండుట వలన నాకు వంత హెచ్చగు చున్నది. మఱి దేవిదుఃఖము దెలుప నలవి గాదు. అది యుక్తమే కదా. (కన్నీరు దుడుచు కొనుచు.)

క. సూనుఁడు గలుగమి శోకము,
సూనుం డుదయించి చనుట శోకతరం బౌ,
నానాగుణఖనిసుందర
సూనుఁడు పోవుట యపారశోకము గాదే?

నాపుత్త్రు నేఁ బొగడఁ గూడదు. కాని, మంత్రీ! నీ వెఱుంగ వే?

శా. మాంధాకారుఁడు ధీరపాళినుతుఁ డ
స్మద్వంశదుగ్ధాబ్ధిరా
కారాత్త్రీనుఁడు మిత్త్రసంతతిమనః
కంజాతమిత్త్రుండు ఘో
రారిక్ష్మాతలభర్తృచక్రవనదా
వాగ్నిప్రతాపుండు ప
ద్మారామేశకృపాప్తసద్గుణుఁడు మ
ద్బాలుండు సామాన్యుఁ డే?

గుణ—ఏలిక యింత గాఁ జింతింప నిపు డేమయ్యె? నావచనము విశ్వసింపుఁడు; ధైర్యము వహింపుడు. యువరాజుగారు క్షేమముగా నున్నవారు; కొలఁదిదినములలో నె భవత్సన్నిధికి రాఁ గలరు.

మాధ—అ దే మొకో చిరంజీవిని గందు ననునాశ తగ్గు చున్నది! నా కంత కంతకుం జింత వృద్ధి యగు చున్నది. మంత్రీ! నేను ధైర్య మొందఁ జాలను; రాజకార్యముల నిఁక నిర్వర్తింప లేను.

గుణ—మహారాజా! భవత్తుల్యధీరు లి ట్లందు రే?

రామభద్రుఁడు—[ప్రవేశించి] జయము. జయము. మహారాజా!

గుణ—ఏమి సంవాదము?

రామ—సుందరుం డగునొకరాజనందనుండు కర్ణాటకదేశంబునుండి వచ్చి ప్రభువువారి దర్శనార్థము సింహద్వారంబునఁ గాచి యున్నవాఁడు. అతం డెక్కినగుఱ్ఱము యువరాజుగారిగుఱ్ఱమును బోలి యున్నది.

మాధ—ఒకదానిని బోలి వే ఱొకటి యుండ దా? రామభద్రా! అతనిని లోనికిం బంపుము.

రామ—చిత్తము. (అని నిష్క్రమించును.)

[మానవతి పురుషవేషముతోఁ బ్రవేశించును.]

మాన—[ప్రవేశించి] మహారాజా! ఇదె, మానవర్మ ప్రణమిల్లు చున్నవాఁడు. (అని మ్రొక్కును.)

మాధ—సుఖీభవ. (పీఠముం జూపించి) మానవర్మా! ఇక్కడఁ గూర్చుండుము.

మాన—(కూర్చుండును.)

మాధ—నీ వెవ్వఁడవు? ఇక్కడకు రాఁ గారణ మేమి?

మాన—నే నొకక్షత్రియపుత్త్రుండను; గురుకరుణావలన శస్త్రాస్త్రముల ను శాస్త్రముల ను దగుమాత్ర మభ్యసించినవాఁడను; భవత్సేవఁ జేయ వచ్చినవాఁడను.

మాధ—నా సేవ నా?

మాన—ఔను. భవత్సేవ నె.

మాధ—(జనాంతికము గా) మంత్రీ!

ఆ. వె. ఇతనిముద్దుమోము, నతివినయమ్ము ను,
గ్రొత్తజవ్వనంపురూపు, నడరు
తేటతేనె గాఱుమాటలు ను, మదీయ
చిత్తమును వశంబు చేసికొనెను.

మఱి యేమ న దేలొకో యితనియందు నాకుఁ బుత్త్రవాత్సల్యము జనించు చున్నది!

గుణ—(జనాంతికము గా) మహారాజా! ఇతండు సర్వవిధంబుల మనోహరుం డె.

మాధ—(ప్రకాశము గా) నాయనా, మానవర్మా! నిన్నుం జూడ నానందనుం జూచినచందంబున నే నానందముం బొందుచున్న

వాఁడను. కాన నిద్దినంబునుండి నీవు నాకుం దనయుండవు. దేశాంతరగతుం డయిననానుతుండు వచ్చు నేని, మీ రిద్దఱు సోదరుల వలె నుందురు గాక! ఆతండు రా కుండిన—(అని కన్నీరు విడుచును.)

మాన—మహారాజా! మీరు వంత నొంద నలదు. భవత్పుత్రుండు దక్షిణాపథంబున వివాహంబుఁ జేసికొని క్షేమంబు గా నుండుట నే నెఱుంగుదును. ఏ లోకో యతం డిక్కడకు రాక తడసెను! కొద్దిదినంబులలోఁ దప్పక రాఁ గలండు.

గుణ—మహారాజా! మానవర్మగారి మాట నమ్ముఁడు; ధైర్య మూనుఁడు.

మాధ—(కన్నీరు దుడుచుకొనుచు) నాయనా, మానవర్మా! నీవచనము సత్య మయి చిరంజీవి త్వర గా వచ్చుఁ గాక! చింతాక్రాంతచిత్తుండ నగు నే నంతదాఁక రాజ్యకార్యంబులను జేయం జాలను. కావున నీవు యువరాజ వై యిమ్మంత్రి సత్తము నను మతిం దత్కార్యంబులను నెఱవేఱుచు చుండుము.

మాన—(తనలో) నాయిడుమలు గడచెను; మంచిసమయము ప్రాప్తించెను. కానిచో నిట్టిపదవి నాకయాచితము గా నబ్బునే? (ప్రకాశము గా) భవదాజ్ఞకు విధేయుండను.

మాధ—మంత్రీ! ఇతఁడు యువరాజని యిప్పుడె ప్రకటించి, యితనిని గొని ప్రజాపాలనము సేయు చుండుము.

గుణ—దేవరయానతిఁ దలఁ దాల్చితిని.

మాధ—రామభద్రా!

రామ—[ప్రవేశించి] ఏమి సెలవు?

మాధ—ఈయువరాజునకుఁ జిరంజీవిసౌధంబుఁ జూపింపుము. దానిలో నితం డుండును.

రామ—చిత్తము.

మాధ—ఇఁక మనము వెళ్లుదము.

(అని యందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—మానవతీమందిరము.

[మానవతియు గుణనిధి యుఁ గూర్చుండి ప్రవేశింతురు.]

మాన—మంత్రిగారూ! ఇప్పట్టణమున సత్రశాల గల దా?

గుణ—కలదు.

మాన—అక్కడ నన్నివర్ణముల కన్నప్రదాన మగు చుండు నా?

గుణ—సకలకులజులకు సంతతాన్నదాన మగు చుండును.

మాన—ఇక్కడ మంచిచిత్రకారుఁడు గలఁ డా?

గుణ—మయుని మించినవాఁడు గలఁడు.

మాన—వానిని రేపు రేపకడ నామందిరంబునకుం బంపుఁడు. వాని కొకరూపవతీ రూపమును జూపింతును. వాఁడు దాని

నొకపటంబున వ్రాయ వలెను. అప్పటంబు సత్రశాలాద్వారంబునఁ గట్టించి, యవ్వోటఁ గొందఱుభటులతో రామభద్రుఁడు గాచుకొని యుండ వలెను. మఱి యు నప్పటమును గని దూషించువారి ని భూషించువారి ని దోడ నె పట్టుకొని నాకుం దెలిపి నా సెలవు చొప్పునఁ జేయు చుండ వలెను.

గుణ—సర్వమును భవచ్చిత్తవృత్తిరీతి నగును.

మాన—లెండు. మనము సభకు వెళ్లుదము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—సత్రశాలాద్వారము.

[రామభద్రుఁ డటు నిటుఁ దిరుగుచుఁ బ్రవేశించును.]

రామ—(పటమును జూచుచుఁ దనలో) నే నిన్నినా ళ్లీపటమును గాచుకొని యున్న నొకఁడు ను దీనినిఁ జూడఁడు. ఇంక నెన్ని దినంబులు దీనిని గాచుకొని యుండవలసి వచ్చు నో? (అని యాలోచించు చుండును.)

గౌరీపతి—[ప్రవేశించి పటమును గని] ఓసీ, తొత్తా! నన్ను నట్టడవిని దిగనాడి యిక్కడ నున్నదాన వా? ఓసి, లంజె! నీయబ్బ కచ్చి యుంటి నా రే యంత యు నిన్ను మోయుటకు? ఓసి, ముండా! నీసొంపు మండి పోను! ఎవనిని దగులుకొని యిక్కడకు వచ్చితి వే?

రామ—భటులారా! రండు. వీనిని బట్టుకొనుఁడు.

(అనఁ గొందఱుభటులు వచ్చి గౌరీపతిని బట్టు కొందురు.)

గౌరీ—న న్నేల పట్టుకొంటిరి?

రామ—(వానితో) మా టాడకు. భటులారా! వీనిని గొని నా వెంట రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—సత్త్రశాలాద్వారము.

[రామభద్రుఁడు ప్రవేశించును.]

రామ—(తనలో) ఇన్నినాళ్ల కొక్కఁడు నాకుఁ జిక్కెను. వానికిఁ గారాగార మబ్బెను. (ముందుఁజూచి) ఎవ్వఁడో యిటు వచ్చుచున్నవాఁడు!

శంకరగుప్తుఁడు—[ప్రవేశించి పటమును గని]

క. ఒనరించి మాయ, నాధన
   మును నాశముచేసి, ఋణసముద్రము నందున్
నను ద్రోసి, వచ్చి యీపట
   మున నుంటే? కపటధాత్రి! పూరుషహంత్రీ!

అబ్బా! నీ వెంతదానవే! ఓసీ, మాయలాఁడీ! నీమాటలు నమ్మి చెడితిని గదే! ఓసీ, టక్కులాఁడీ! నీటక్కులలోఁ జిక్కినావలె నిక్కడివా రెంద ఱో చెడియుందురు గదా!

రామ—భటులారా! వీనిని బట్టుకొనుడు.

(అనఁగా భటులు వచ్చి శంకరగుప్తుని బట్టుకొందురు.)

శంక—అయ్యలారా! న న్నేల పట్టుకొంటిరి? ఈపటమును గని, నాకడుపుమంట కొలఁది నే న ట్లంటిని. కాని—

రామ—(శంకరగుప్తునితో) నోరు మూసికొని యూర కుండుము. భటులారా! వీనిని గొని యిటు రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—సత్త్రశాలాద్వారము.

[రామభద్రుఁడు ప్రవేశించును.]

రామ—(తనలో) ఇప్పటి కిద్దఱు నా కబ్బిరి. వారిద్దఱికి నొకగతి యె కలిగెను. అదిగో మ ఱిద్ద ఱిటు వచ్చు చున్నవారు! వీరు ను వారిచెంతఁ జేరుదు రో?

[అంత భీమన్న యు సోమన్న యుఁ బ్రవేశింతురు.]

భీమ—(పటమును గని మోఁకరించి) అమ్మా! మాయం దేమి నేరముఁ గనిపెట్టితివి? మ మ్మేల విడిచి వచ్చితివి? మేము నీబిడ్డలము గా మా? నీకు జాలి లే కుండుట న్యాయ మా?

సోమ—(మోఁకరిల్లి) తల్లీ! నీయిచ్చకు వచ్చినట్లు మేము మసలు కొన లే దా? మమ్ముఁ దల్లిలేనిబిడ్డలను జేసి వచ్చితివి గదా! నీ మనను గరంగ దా?

రామ—భటులారా! వీరిం బట్టుకొనుఁడు. వీరిం బట్టుకొనుఁడు.

(అనఁ గా భటులు వారి నిద్దఱిని బట్టుకొందురు.)

భీమ } —మే మేమి తప్పుఁ జేసితిమి? మ మ్మేల పట్టుకొంటిరి?
సోమ }

మాతల్లిని మేము బ్రతిమాలుకొన వల దా?

రామ—(ఇద్దఱి నుద్దేశించి) అట్టె ప్రేలకుఁడు. ప్రేలకుఁడు. భటులారా! వీరిం దీసికొని రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—సత్త్రశాలాద్వారము.

[రామభద్రుఁడు ప్రవేశించును.]

రామ—(తనలో) వీ రిద్దఱికిం గారావాసము లభించిన ను బటంబును దిట్టకుండుట వలనఁ గాఁ బోలు వారికిం బలెఁ గష్టానుభవము మాత్రము లేదు. ఇట్టివార లింక నెంద ఉందు రో? మ ఱెంతకాల మీపటమును నేఁ గాచు చుండ వలె నో? (ముందుం జూచి) ఇదిగో! ఎవఁ డో యి టె వచ్చు చున్న వాఁడు! వీఁడు ను నా చేతఁ జిక్కును గాఁ బోలు!

[అంత "ధృతపూతమతీ" యనుపద్యముం బఠించుచు గోపాలవర్మ ప్రవేశించును.]

గోపా—(పటమును గని వంతతో) హా! ప్రాణప్రియా! హా! రాజతనయా!

మత్తకోకిల.

అక్కటా! నను నల్లకానన
మందు నిర్దయురాల వై
దిక్కుమాలినపక్కిఁ జేయుచుఁ
దెప్పున న్నటుమాయ మై
యిక్కడం బ్రతిమాకృతిన్ ధరి
యించి నాసుకృతంబునం
జిక్కితే? సుకుమారి! మామక
జీవి తేశ్వరి! సుందరీ!

(అని ప్రతిమను బట్టుకొని నుంకించి నేలఁబడి మూర్ఛిల్లును.)

రామ—రండు. భటులారా! రండు. వీనిమూర్ఛ కుపచారములు సేయుదము.

(వార లుపచారములు సేయఁ గా గోపాలవర్మ దెప్పిఱిల్లి కూర్చుండును.)

రామ—భటులారా! వీఁడు దెప్పిఱిలెను. కాన వీని నిఁకఁ బట్టుకొనుఁడు.

(అనఁ గా భటులు గోపాలవర్మను బట్టుకొందురు.)

గోపా—న న్నేల పట్టుకొంటిరి?

రామ—(గోపాలవర్మతో) మాటలు మాని మాతోడ రమ్ము. నీకె తెలియును. భటులారా! రండు. రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—మార్గము.

[రామభద్రుఁడు నడుచుచుఁ బ్రవేశించును.]

రామ—(తనలో) ఇతం డేలాకో వారలతోఁ జేర్పఁ బడక యొక సౌధంబున నుండి రాజోపచారంబులం బొందుచు రాజవైద్యులచేతఁ జికిత్సితుం డగు చున్నవాఁడు? ఈచరిత్ర మతిచిత్రము! మఱి బుద్ధి కగోచరము! ఏ దెట్లయిన నిన్ని దినములకు నాప్రయాసము దీఱెను. "ఇఁక నీ వాపటంబును గాచుకొని యుండ నక్కఱ లే" దని నాకు యువరాజుగారియాజ్ఞ యయినది. కాన నే నిపు డేగి నాపూర్వసేవం జేసికొనుచు సుఖింతును.

(అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—మార్గము.

[వినోదుఁడు నడుచుచుఁ బ్రవేశించును.]

వినోదుఁడు—(తనలో) "ఓ వినోదా! నేఁటిసభకు నీవును దప్పక రావలయుఁ జుమీ" యని మానవర్మగారు నా కాన తిచ్చిరి. నే నెంత త్వరపెట్టినను మందురా లగునాయిల్లాలు వేగము గా

పండినది కాదు. తిండిపోతునకు నాకు రాజాజ్ఞ సైతము దండి యయినది కాదు గదా! [మిన్నుంజూచి] ఓహో! చాల యాలస్య మయినట్లున్నది!! సభకు నేను వేగ నేగవలెను.

(అని నిష్క్రమించును.)

---

ప్రదేశము—సభామందిరము.

[మాధవవర్మ యు మానవర్మ యు గుణనిధి యు వినోదుఁడు ను మఱికొందఱు సభ్యులు ను గూర్చుండి ప్రవేశింతురు.]

మాధ—నాయనా! సభకు నేఁడు న న్నేల రమ్మంటివి?

మాన—అతిచిత్రము ను గడువినోదకరము నగునొకవివాదము గలదు. దానిని దేవర యె తీర్ప వలె నని.

వినో—ఏమీ! నామాటకంటె వినోదకర మా?

మాన—సార్థకనాముఁడ వగునోవినోదా! ఈవివాదము నీవచనము కంటె నధికవినోదకరము.

వినో—యువరాజు గారికి విదూషకవచనములకంటె వివాదము లె యధికవినోదకరములు! (అని నవ్వును.)

మాన—ఓయీ! నీవచనము లితరులకుం గాక, నీకు వినోదకరములు గావు గదా. ఇది నీకు సైతము—

వినో—అట్లయినచో నేదీ యావివాదము?

మాధ—నాయనా! వివాదము గలవారిని రప్పింపుము.

మాన—రామభద్రా!

రామ—[ప్రవేశించి] ఏమి యాదేశము?

మాన—పటంబును గని దూషించినవారి ని భూషించినవారి ని నిక్కడఁ బ్రవేశింపం జేయుము.

రామ—చిత్తము. (అని నిష్క్రమించి, భటావృతు లగునుపర్యుక్త జనులతోఁ బ్రవేశించి) దేవా! ఇదిగో వారలు వచ్చిరి.

మాన—(లేచి పీఠముం జూపుచు గోపాలవర్మతో) మీ రిచ్చటఁ గూర్చుండుఁడు.

గోపా—(కూర్చుండి తలవంచుకొని యుండును.)

వినో—(చూచి) ఇది నిజము గా వినోదకర మయిన దే.

మాన—(కూర్చుండి) ఇప్పు డే మయ్యెను? వినోదా! ఇంచుక యోర్పు గలిగి యున్నచో నింక—

వినో—అధికము గా నె యుండును. కావునఁ గావలసినంతయోర్పుఁ జెంది యుందును.

మాధ— (జనాంతికము గా) మంత్రీ! అతఁడు చిరంజీవి గాఁ డా?

గుణ—(జనాంతికము గా) ఔను. ఆయన మనయువరాజు గా రె. కాని, యీచిత్రవివాదము సాంత మగువఱకు దేవర మాత్రము త్వరపడక తెలియనివారువోలె నటింప వలెను.

మాధ—(జనాంతికము గా) అ ట్లే చేయుదును.

సభ్యులు—(అన్యోన్యావలోకనముం జేయుచు మా ట్లాడ కుందురు.)

మాన—మహారాజా! దేవర సెల వయినచో, విచారణఁ బ్రారంభింతును.

మాధ—నాయనా! కా నిమ్ము.

మాన—(శంకరగుప్తు నుద్దేశించి) ఓయీ! నీ వాపటంబును గని యేల దూషించితివి? భయపడక నిజముఁ జెప్పుము.

శంక—దేవా! నిజము నే చెప్పుచున్నవాఁడను. అవధరింపుఁడు:—కలదు కదా ద్రావిడదేశమునఁ గనకపురి యను నొకపట్టణము. నే నందు వాణిజ్యముఁ జేయుచు మితి లేనిసిరి గలిగి శంకరగుప్తుఁడు నాఁ బరఁగెడి వాఁడను. నా కమితవిత్త మున్న నుజక్కనిలేమ లేమిం జేసి, నేను జింతించుచు నొకనాఁడు నాకూటంబునం గూర్చుండి యుండఁ గాఁ గొన్నివస్తువులం గొన నొకనుందరుండు రా నాతనిఁ గూర్చుండం జేసి తదుదంతంబు నడుగ నతం డి ట్లనియె. "నేను గళింగదేశరాజనందనుండ నగుగోపాలవర్మను. ముద్దుగుమ్మలను నమ్మక నే ననేకదేశమ్ములు దిరిగి నృపతనయలం బరీక్షించుచుఁ దుదకుఁ గర్ణాటకమ్ముఁ జేరి యమ్మనుజపతి నుతను మానవతి యనుదానిని వలచి పెండిలియాడి వెంటఁ గొని వచ్చుచు క్షిప్రపట్టణప్రాంతంబున విడిసితిని. అక్కనకాంగి యొక్కరి తె ప్రమాత మక్కడ నున్నది. కాన నేను వస్తువులం గొని గ్రక్కున నేగ వలెను." దేవా! ఇప్పలుకులు వినినంత నె యప్పుడఁతిపై నా కొకగొప్పయాస దెప్పున నుప్పతిల్లెను.

గౌరి—(తనలో) వీఁడా శంకరగుప్తుఁడు?

వినో—పెఱవాని పెండ్లము బెల్లముకంటెఁ దీపైనది కాఁ బోలు!

మాన—తరువాత?

శంక—నే నతని కొకపరి సరకుల నొసంగక జాలముఁ జేయుచుఁ గపటంబున నతని యుంగరంబును గైకొని దానిని నాభటునిచేతి కిచ్చి పంపఁ గా వాఁ డక్కలికి కడ కేగి, భూవరకుమారుండు గుఱ్ఱముమీఁదినుండి పడుటవలనఁ గాలు విఱిగి బాధ నొందు చున్నట్లు వచించి యయ్యానవాలుం జూపించి నమ్మించి యచ్చాన ను దెచ్చి పెరటిదారిని మాయింటం బెట్టెను. అంత నే నాభూ కాంతు నవ్వలకుం బంపించి యక్కాంతచెంతఁ జేరితిని.

వినో—సొమ్ముకొఱకే కాక, సుదతికొఱకు సైత మొరునికంట దుమ్ముఁ గుమ్మరించితి వా?

మాన—ఎంతసులువు గా నక్కాంతను దక్కించుకొంటివి! పిమ్మట?

శంక—అయన్నులమిన్న నన్నుఁ జూచి తన్నుఁ జేర వల దని యుఁ దన కొకసంవత్సరదీక్ష గలవ్రతము గల దని యు దానిని జేయించువాని నె తాను వరింతు నని యు నంతదాఁకఁ దా నొంటి గా నొకయింట నుండ వలె నని యుం బలికి యావ్రత విధానము నుపన్యసించెను. దేవా! ఆవ్రతము సొంత మగుటకు ధనదధన మె యంత మగును; మఱి నాధన మన నెంత? అయిన ను నేను గ్రిందు ను మీఁదును జూడక యాసుందరిపొందు నె కోరి వ్రతమును జేయించుచు, నాసంపద కడతేఱఁ గా నప్పుఁ జేయుచు దినములు లెక్కించుకొను చుంటిని.

మాన—ఓయీ! చేఁ జిక్కినదానిని బలిమిం జెఱుపక, నీకలిమి నేల నేలపాలు గావించుకొంటివి?

శంక—నేను బలాత్కరించినయోఁ దాఁ జచ్చునో లేక నన్నుఁ జంపునో యని వెఱచి సాహసింపఁ జాల కత్తరుణిదయను సంపాదింపఁ బ్రయత్నించితిని.

మాన—పిదప?

శంక—ఒకనాఁడు రేపకడ నాసేవకుండు నాకడకు వడి వడి గా వచ్చి యప్పడఁతి గనఁబడ దని నుడివెను. అంత నే నెంత వెతకించిన నాయింతి గాన రా దయ్యెను. మఱి యు నానాఁటి రాతిరి యె యూ పెపెట్టెలు ను గుఱ్ఱము ను మాయ మయ్యెను. పిదప న ప్పిచ్చినవారిబారి మీ ఱెను. స్వజనము నన్ను దూ ఱెను. కాన నే నవ్వోటు విడిచి దేశాటనముం జేయుచు నిచ్చోటునకు వచ్చి పటంబున నారూపసిరూపుం జూచి దుఃఖంబు నిలుప లేక దూషించితిని. దేవరవారు నన్ను మన్నింప వలెను.

వినో—పంచన కిది మంచిఫలము.

మాన—ఓయీ! నీ వాకామినితోఁ గాఁపురము చేసితివి కదా.

శంక—కాఁపుర మా? హరహర! ఎంతమాట! అ ట్లొకింత చేసి యుండిన నింత గాఁ జింతింపను. నే నానాతిం దాఁక లే దని ఘోరప్రమాణముం జేసెదను.

మాన—అన్నిదినంబు లింట నుంచుకొని యు నంతవిత్తము వెచ్చించి యు నత్తన్విం దాఁక లే దనిన నెవ్వరు విశ్వసింతురు? కావున

నీ వున్నది యున్నట్లు చెప్పినచో నిన్ను మన్నింతుము. లేకున్న నిన్నుఁ జంపింతుము.

శంక—నన్నుఁ జంపినచో, దేవరవారి కెన్న రానిపున్నెము గలుగును; ఇంతటితో నాచింత కంత మగును. కాన నో దేవా! త్వరగా నాకు మరణదండనము విధింపఁ దగును. కాని, నావక్కాణములో నొక్కయక్కర మయినం బొంకు లేదు.

మాన—సభ్యులారా! మీతాత్పర్య మేమి?

సభ్యులు—వీనిమాటలు విశ్వాసార్హము లని యె.

మాన—మంత్రిగారూ! మీయభిప్రాయము?

గుణ—"ఆసాధ్వీచరిత్రమునందు సంశయింపం బని లే" దని.

మాన—మహారాజా! ఏమి యాజ్ఞ?

మాధ—వంచకుం డయినను వీఁడు వచించినది నమ్మం దగి యున్నది.

మాన—(గోపాలనర్తతో) అక్కాంతను దత్కాంతుండు గ్రహింపవచ్చునా?

గోపా—తప్పక గ్రహింప వచ్చును.

మాన—(గౌరీపతి నుద్దేశించి) ఓయీ! నీ వాపటంబు నేల తిట్టితివి? భీతి నొందక సత్యముఁ బలుకుము.

గౌరీ—దేవరా! సత్యము నే పలుకు చున్నవాఁడను:—నేను గనకపురియందు బట్టలను గుట్టుచు బ్రతుకు చుంటిని. నాది జంగము కొలము; పేరు గౌరీపతి. ఒకనాఁ డొకఁడు వీదియందు రూపాయలను విసరి వేయుచు వెళ్లు చుండఁ గా జనులు వాని నేఱుకొను

చుండిరి. నే నెంత వెతకిన నొక్కరూపాయ యైన ను నాకుం జిక్కలేదు. కాని, శంకరగుప్తునిగుమ్మముముందఱ నొకచీటి దొర కెను. దానిలో నిట్లువ్రాయం బడి యుండెను. "మీరు నేఁటి నడురేయి యీమేడకడకువచ్చినచో మనము గలసి వెడలుదము." ఆచీటిని శంకరగుప్తునిక్రొత్తపెండ్లా మెవని కో వ్రాసి యుండు నని తలంచి నగలతో నది దక్కినచో విదేశమున వివిధసుఖము లొంద వచ్చు ననునాసచేత నే నారే యచ్చటఁ గాచుకొని యుండి, మేడనుండి తొలునిచ్చెనతెన్నున దిగు చుండిన యారా మను నామూఁపున నెక్కించుకొని పరుగెత్తితిని.

శంక—(తనలో) ఈజిత్తులమారితొత్తుకొడు కా యా బిత్తరి నెత్తి కొని పోయినవాఁడు?

వినో—బలే! లింగమూర్తిని మోయుచు నంతకాంతను మోసికొని పరుగెత్తిన నీవు మిక్కిలిబలవంతుండవు! కాని, నీగుండెకు లింగని పోటు మెండై యుండుం గదా!

మాన—పిమ్మట?

గౌరీ—తెల్లవారునప్పటి కొకకాఱడవిం జేరి, దానిని దిగువ దించి తిని. అప్పు డాచేడియ నాచేతి కొకచెంబు నిచ్చి నీరము కొఱకు నన్నుఁ బంపి తాను మాయ మయ్యెను. నే నాచానం గానం జాలక, శంకరగుప్తునకు జడిసి కనకపురి కేగక దేశాల త్రిమ్మరి నై యిక్కడకు వచ్చి పటమునం దాచెలియరూపును గని కోపము నాఁప లేక తిట్టితిని.

మాన—అయ్యో! నీ వొక్కరాత్రి మాత్ర మే యామెతో సుఖిం
చితివి!

గౌరీ—సుఖించితి నా? లేదు. లేదు. మోయలేక చచ్చితిని.
నాలింగమూర్తితోడు; నేను మ ఱెట్టిపాపంబుఁ జేయ లేదు.

మాన—ఓయీ! రే యంత యు మూఁపున మోసి నీ వాపూవుఁ
బోఁడి నూరక పో నిచ్చితి వనిన నెవరు నమ్ముదురు? నీమాయను
మాని యథార్థముఁ బలికినచో నిన్ను క్షమియింతుము. కానిచో
నీతలఁ దీయింతుము.

గౌరీ—మీ రేమి చేయించిన ను జేయింప వచ్చును. నేను జెప్పినది
మాత్ర మనృతము కాదు.

మాన—సభాస్తారులారా! మీ రే మనెదరు?

సభ్యులు—వీఁడు ను సత్యము నె చెప్పెను.

మాన—మంత్రిగా రే మందు రో?

గుణ—అవ్వనిత పతివ్రత.

మాన—మహారాజా! ఏమి సెలవు?

మాధ—నాయభిప్రాయము "వీఁ డసత్యముం జెప్ప లే" దని యె.

మాన—(గోపాలవర్మతో)అయ్యువతిని దత్పతి గ్రహింప వచ్చు నా?

గోపా—అవశ్యము గ్రహింప వచ్చును.

మాన—(చోరుల నుద్దేశించి) మీ రాపటంబును జూచి యేల
యేడ్చితిరి? జడియక నిజము నుడువుఁడు.

భీమ—మహాప్రభూ! మన్నింప వలెను. మేము దొంగలము; అన్న దమ్ములము; నా పేరు భీమన్న; వీని పేరు సోమన్న. మే మొకనాఁ డడవిం దిరుగు చుండఁ గా నాయమ్మ గనం బడి "నన్ను మీ యింట నుంతు రా?" యన వల్లె యని యీ యమను మాయిం టికిం గొని పోయితిమి. కన్నతల్లికంటె నెక్కుడ గా మమ్ము నామె కాపాడుచు మంచిమంచినంటకములు వండి మా కిచ్చు చుండెను.

గారీ—(తనలో) నట్టడవిని నాపుట్టి ముంచినవార లీచెట్ట లా?

సోమ—మహాప్రభూ! ఆయమ్మచేతివంటకంబులు మెసవనివాని యును రేలా?

మాన—అటుపిమ్మట?

భీమ—ఆమె కోరఁ గా శంకరగుప్తునింటినుండి రెండుపెట్టెలు నొక గుఱ్ఱము ను దెచ్చి యాతల్లి కిచ్చితిమి. ఎప్పుడు ను మే మాపె సెలవును మీఱ లేదు. ఇట్లుండ నొకనాఁ డాయమ మమ్ము విడిచి యెక్కడ కో యేగెను. అంత మే మెంత యు వంత నొంది మా బ్రతుకులపై రోసి యెచ్చట నయిన నాసతీమణిని గందు మే మోయను నాసుచేతఁ బెక్కు దేశంబులు దిరిగి యిచ్చోటున కేగుదెంచి యప్పటంబున నాయమ్మరూపును గాంచి యేడ్చితిమి.

(అని కన్నీరు విడుచును.)

సోమ—మహాప్రభూ! నిజముగా నాతల్లి మమ్ముఁ దల్లిలేనిబిడ్డలను గాఁ జేసి వెళ్లెను. (అని కన్నీరు విడుచును.)

వినో—వీరు భోజనప్రియులు; నా కన్నులు. నేను సైత మెక్క
గారెకొఱ కెంతదూరమయిన నేగుదును.

మాన—(చోరుల నుద్దేశించి) భార్యాభర్తల వలెఁ గదా యామె
యు మీరు నుంటిరి?

భీమ, సోమ—(చెవులు మూసికొని) శివశివ! ఎంతపాపపుఁబలుకు
విన వలసి వచ్చె? మే మామెను గన్నతల్లికంటె వేఱు గాఁ
దలంచి యుండినచో మానెత్తిపైఁ బిడుగు వడుఁ గాక!

మాన—దొంగలు దమయింట నున్న పరతరుణిని దల్లి గాఁ దలంతు రా?
మేము నమ్మంజాలము. నిజ మాడినచో మిమ్ము రక్షింతుము.
లేనిచో మీకండలం గోయించి గ్రద్దలకు వేయింతుము.

భీమ, సోమ—మీచిత్తానుసారము గాఁ జేయింపుఁడు. ఆమె మాకుఁ
దల్లి; మే మామెకు బిడ్డలము.

సభ్యులు—యువరాజా! వీరు పలికినది కల్ల గాదు. ఆరాచపట్టి
తనయునుసు నయినం బోఁ గొట్టుకొనును. కాని యిట్టినీచులను
జేపట్టు నా?

గుణ—యువరాజా! మీ కేల సందేహము?

మాధ—నాయనా! వీరు చోరు లె యయిన ను, వీరివచనములు
విశ్వసనీయములు.

మాన-(గోపాలవర్మతో) అత్తరుణిం దద్వగుండు గ్రహింప వచ్చు నా?

గోపా—నిస్సందేహము గా గ్రహింప వచ్చును.

మాన—సభాసదులారా! మీ రాధరావరపుత్రిచరిత్రము ను సవిస్తరము గా వింటిరి కదా. సత్యము వచింపుఁడు. మీయభిప్రాయ మేమి?

సభ్యులు—నిశ్చయము గా నాతల్లి సతీమతల్లి. అచ్యుతురాచరిత్రము నిష్కళంకము ; మఱి జగజ్జేగీయమానము.

మాన—నా డెందంబు మాత్ర మింక ను సందేహంబు నే పొందుచున్నది.

సభ్యులు—దానికి మే మేమి చేయఁ గలము? ధర్మదేవత మీసంశయము ను దీర్పఁగాత!

[తెరలో] - మానవతి సతీమణి. మానవతి సతీమణి.

మాధ—ఆకాశవాణి యీరమణిని సతీమణి యను చుండ నింక వననివా రెవరు? నాయనా! ఇఁక నీసంశయంబును విడువుము.

మాన—(గోపాలవర్మతో) ఆపటంబును గనినప్పుడు మీ కేల నంత గలిగెను?

గోపా—చెప్ప నే మున్నది? ఉక్తకథానాయకుండ నే నె.

మాన—ఓహో! యువరాజుగా రా మీరు? అట్లయినచోఁ బిత్రువందన మాచరింప రేల?

గోపా—(లేచి సమీపించి) నాయనగారూ! ఇదిగో, భవత్తనయుఁడు—గోపాలవర్మ ప్రణామముఁ జేయు చున్నవాఁడు. (అని తండ్రికి మ్రొక్కును.)

మాధ—సుఖీభవ. (అని కౌగిలించుచుఁ జెంతం గూర్చుండం జేసి) నాయనా! ఎంత కాలమునకు నాకుఁ గనం బడి నాచింతను

బాపితివి! అక్కటా! నీ వెన్నికష్టముల ననుభవించితివి! నీవు పరిణయం బయినయప్పరమపతివ్రత యే మయ్యె?

గోపా—నా కేమి యుం దెలియదు.

మాన—(గోపాలవర్మతో) ఆయంగన వచ్చినచో దానిని మీ రంగీకరింతు రా?

గోపా—అగ్రజగామినిం గనునంతసుకృతంబు నా కున్న దా?

(అని తలవంచుకొని చింతించు చుండును.)

మాన—చింతింపకుఁడు. ఇప్పు డె యప్పడంతిని రప్పింతును.

(అని నిష్క్రమించును.)

[అంత మానవతి నిజరూపంబుతో వచ్చి మగనికి నిమామకు ను మ్రొక్కును.]

గోపా—(మానవతికరముం బట్టుకొని) ఇదిగో, నాప్రాణేశ్వరి! ఇదిగో, నాజీవేశ్వరి!

మాధ—ఇప్పుడు కదా నాకు నేత్రానంద మయ్యెను! ఇప్పుడు కదా నాకులము ధన్య మయ్యెను!

వినో—(లేచి)

గీ. మునుపు సతి గ నుండి శిఖండి పురుషుఁ డగుట
శ్రీమహాభారతమునఁ బ్రసిద్ధి గలదు,
మానవర్మ తటాలున మానవతి గ
మాఱు టయ్యెఁ బ్రత్యక్షంబు మనకు నిపుడు!

మాన—(మాధవవర్మతో) భవన్నికటంబున నేను నటించినకపట నటనమునకు నన్ను మన్నింప వేఁడుకొందును.

మాధ—అమ్మా! నిన్ను మన్నింప వేఁడుకొందువా? సరి. సరి. నీ నటనమువలనఁ గాదే నేను నానందనునిం బడయుట? మఱి నా గోత్రము పవిత్ర మగుట?

గుణ—యువరాజా! మీ రెట్టు లయినం బట్టినపట్టును విడువక సాధించి సాధ్వీమణిని సంపాదించి సాంద్రకీర్తి నీజగంబున స్థాపించితిరి!

గోపా—అది మీవంటి పెద్దల యాశీర్వాదమహిమ.

గుణ—మహారాజా! విచారణ ముగిసెను. కావున శిక్ష విధింపం దగును.

మాధ—అమ్మా! విచారణఁ జేసినదాన వగుటం జేసి, నీవె దండనము విధింప వలెను.

మాన—ఆర్యు లుండఁగా నే నా దండనము విధించుదానను? అయిన ను దేవరయానతిం దలం దాల్చి మదుద్దేశంబు నిట్లు నివేదించు చున్నదానను:—సర్వస్వనాశనమువలన ను గారాగార వాసమువలన ను శంకరగుప్తుండు ను, నేవలకారావాసవాసము వలన గౌరీపతి యు ను నిజకర్మానురూపఫలంబుల నిదివఱకె పొందియుండుటం జేసి, వా రిద్దఱు ను విముక్తులై యిప్పుడె యి ద్దేశంబును విడిచి యేగ వలెను; నాయందు మాతృభక్తి

గలిగియున్న భీమన్నయు సోమన్నయు దేవరవారిసేవఁ జేయుచు నిచ్చటనె యుండవలెను.

మాధ—అట్లే యగుఁ గాక!

సభ్యులు—జయ మానవతి! జయ కృపావతి!

మాధ—మంత్రీ! ఇది యె మంచిసమయము. కాన నిప్పుడె చిరంజీవిని యువరాజుగా నభిషిక్తుం జేసెదను.

గుణ—భవచ్చిత్తానుసారముగాఁ జేయింపవచ్చును. సమస్తము సిద్ధము.

మాధ—రామభద్రా! ఈ శుభసమాచారమును దేవిగారికి విన్నవింపుము.

రామ—చిత్తము.

వినో—ఇన్నిదినంబులకు యువరాజుగారు పత్నీపదవిని బొందిరి!

మాధ—నాయనా! నీకు మ ఱేమి కావలెను?

గోపా—

కం. నాకోరినసతి దొరకెను
నాకొలపుంబరువు నిలిచె, నతవైరిధరి
త్రీకాంత! భవత్పదనా
ళీకములను మరలఁ గనఁ గలిగె నాకన్నల్.

కనుక మ ఱేమియు నాకక్కఱ లేదు. అయిన నిట్లగుం గాక!

భరతవాక్యము.

ఉత్సాహము.

దుష్టదండ మగుటవలన దుర్నయము శమించుతం;
గష్టములు దొలంగి ధరకుఁ గల్గుత న్సుఖంబు; ని
ర్దుష్టపూతచరిత లగువధూమణులకు భర్తలై
హృష్టమానసమున జనులు వృద్ధిఁ గాంత్రు గావుతన్

(అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

మానవతీచరితము

సంపూర్ణము.



# మానవతీచరిత్రము.



## పాటలు.



1 *

నటి—[ప్రవేశించి]

సింధుర_ఏకతాళము.

ఏలా ? సామీ ! । యింతవేగఁ బిలుచుట॥ ప॥

బాలల నలంకరించు । భారము వహించునన్ను॥ నేలా॥

పండితకవిగాయకాళి । ప్రబలవీరరసికపాళి ।

మండిత మయి కాంతి మించు । మాన్యమైనసభకు నిప్పు॥ డేలా॥

నూతనసరసీరుహంబు । రీతి నొప్పుమీమొగంబు ।

పీతకాంతి యగుచుఁ జింత । చేత వాడ హేతువేమి?॥ యే॥



2 *

నటి—["చిత్తము." అని పాడును.]

హిందూస్తానీ కాఫీ - ఆదితాళము.

ఏ మని వర్ణింతును । ఈవసంతము । నే మని॥ ప॥

కామిముదాదముఁ । గాముని మిత్రము॥ నే మని॥

కిసలావృతనవ । కుసుమయుతాగముఁ ।

బ్రసవపరాగసం । భరితోద్యానము॥ నే మని॥

కోకిలశోభిత । కోమలచూతముఁ ।

గాకలిరంజిత । త్మోజనకర్ణము॥ నే మని॥

---

3 *

గోపా—[ప్రమాణికను బతిమాలించినపిమ్మట.]

హిందూస్తానీకాఫీ - రూపకతాళము.

దేవ దేవ! కృష్ణ! వాసు । దేవ! పాహి మాం ।

నావజాతజనక! విశ్వ । పాల! త్రాహి మాం॥ ప॥

విమలజలజపత్త్రనేత్ర! । హాటకాంబర!

విమరసంఘవినుతపాద । కమల! భూధర! ॥ దేవ॥

శ్రీసతీముఖాంబుజాత । భృంగ! కేశవ!

రాసలోల! క్షీరజలధి । వాస! మాధవ! ॥ దేవ॥

గారణవరరక్ష! పక్షి । వాహ! వామన!

గారిదనిభనీలవర్ణ! । పాపసూదన! ॥ దేవ॥

చక్రహస్త! పద్మనాభ! । శక్రసన్నుత!

క్రమేశవరద! మౌని । బృందవందిత! ॥ దేవ॥

---

4 *

మాన—[“ నీయెడ మే మేమి తప్పుఁ జేసితిమి?” అనినపిమ్మట.]

తోడి - రూపకతాళము.

అకటా ! నీ వెంత చేసి । తయ్యో ! దైవమా ! ॥ ప॥
అకలంకులబాధ పాడి । యగునె యెంచుమా? ॥ అక॥
తొలి యేనేరంబునైన । సలిపినార మే ? ।
యిల నీ వీబాము మాకు । నిడఁగ నాయ మే ? ॥ అక॥
బుధు లుంచిరి నేతిబీర । పోలె నయ్యయో !
విధినామ సువిధులఁ జేసి । వెలయునీ కయో ! ॥ అకటా॥
ధరణీపతిసూతి వెకలి । తిరిపెగానిఁ గాఁ
జరియింపఁ గఁ జేసి తనియ । సాగినావు . ॥ అకటా

---

5 *

మాన—[“ఎటు వెళ్లుదును?” అనిన పిమ్మట.]

అఠాణా - రూపకతాళము.

నిన్ను నే భజింతు నో । నిఖిలాధినాయకా ! ॥ ప॥
సన్నవాంబుజాంబకా ! । సజ్జనాళిపాలకా ! ॥ నిన్ను
కామతాత ! శ్రీకరా ! । కరుణాజలాకరా ! ।
వామనా ! జనార్దనా ! । వరదా ! సనాతనా ! ॥ నిన్ను

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 6 | ఁడోడ్కొని | ఁదోడ్కొని |
| 12 | 12 | గద | గను |
| ,, | 20 | వర్ల | వర్ణ |
| 13 | 3 | దూరు | దూర |
| 15 | 3 | నీవిందే | నీవీపురమందే |
| 19 | 11 | టన్ను | టన్న |
| 21 | తుదిపంక్తి | పయ | పయి |
| 24 | 9 | నీయూ | యూనీ |
| 33 | 15 | నుయేమి | ని కేమి |
| 43 | 4 | డుతనీవు | నినుఁగొల్చు |
| 45 | 15 | వీవు | లీవు |
| ,, | 20 | మనగళా | మనకళా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 52 | 14 | నాకళి | సౌనళి |
| ,, | 15 | త్రత | వ్రత |
| 55 | 3 | మదనమంజరి | మోహనవణి |
| ,, | 5 | నిన్న | నిన్ని |
| 56 | 16 | సేసింనిద్రావ్వు | సేసింద్రానివ్వు |
| 67 | 7 | లేనవి | పేనలి |
| ,, | 9 | ఁగాబో | ఁబో |
| ,, | 11 | రికము | పికము |
| 68 | తుదిపంక్తి. | సేత్రి | సేత్ర |
| 70 | 18 | కొనుమిదెమదనంబు తుదిదిలిదండీ | కొనుమిదెవఁదవంబుతుదిదిదిచంఁ |
| 71 | 5 | దన్నిఁక | నన్నిఁక |
| ,, | 10 | దతని | నతని |
| 72 | 6 | వాఁడతా | వాఁడరా |
| 74 | 18 | ఁదెల్త | ఁదోల్త |
| 75 | 1 | వాఁడలిం | వాఁడవిం |
| 78 | 3 | నీయుతన | నీయుతస |